


Founder B.V. Radhakrishna

# బాలమిత్ర

బాలల సచిత్ర మాసపత్రిక

*సహాయ సంపాదకుడు :* బి.ఆర్. వరదరాజులు

సంపుటి : 68 | జూన్ 2015 | సంచిక: 6




## మనకు దాహం ఎందుకు కలుగుతుంది?

దాహం కలగటం వలనే నాలుక, గొంతుకు తడారి పోతాయని సాదారణంగా అనుకుంటాము. కాని ఇందులో నిజం లేదు. తాడరి పోవటమన్నది అనేక కారణముల వల్ల కలుగవచ్చు. మనం కాయకష్టం చేస్తున్నప్పుడు గొంతుక ఆరిపోతుంది. ఆవేదన లేక లాలాజలం తక్కువగా ఊరటం ఇందుకు కారణం కావచ్చు.

మన రక్తంలో నీరు, ఉప్పు ఎప్పుడూ ఉంటాయని మీకు తెలుసు. శరీర జీవకణాల్లో కూడా యివి వుంటాయి. సాధారణ పరిస్థితుల్లో ఈ రెండు పదార్థములు రక్తంలో స్థిరంగా ఉంటాయి. ఏ కారణం చేతనయినా రక్తంలో నీరు తగ్గినట్లయితే మెదడులోని దాహ కేంద్రము వెంటనే గొంతుకకు సూచనలు పంపుతుంది. దీని వలన గొంతు కుంచించుకు పోతుంది. ఈ సంకోచము వలన మనకు దాహం కలుగుతుంది.


విడిప్రతి : రూ.15/- | 64 పేజీలు

# శ్రీ వేంకటేశ సుప్రభాతమ్

తంత్రీప్రకర్ష మధురస్వనయా విపంచ్యా
గాయ త్యన త చరితం తవ నారదోఽపి ।
భాషాసమగ్ర మసకృత్కరచారరమ్యం
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్ ॥ 8

టీక : నారదోపి = నారదమహామునికూః తంత్రీప్రకర్ష మధుర ంవవమా = తంత్రుల యొక్క పట్టుచే మధురమైన శబ్దముగల; విపంచ్యా = ఏడుతంతులు గల విపంచియను వీణావాద్యముచే; భాషాసమగ్రం = భాషా మయమైవట్టియు, లేదా భాషచే సమగ్రమైనటువంటియు; అపకృత్కరచార రమ్యం=మాటిమాటికిని చేయాడింపులచే మనో హరిమును అగు; తవ=వీయొక్క; అనంతదరితం = తుదిలేని చరిత మును, లేక ఆవంత = తుదిలేనివాడా; తవ=వీయొక్క; చరితం = చరిత మును అవికూడ చెప్పనగును. గాయతి = గానము చేయుచున్నాడు. శేషాద్రి శేఖరవిభో=శేషాచలాధిపతీ; తవ=వీళ; సుప్రభాతము (అగుగాక).

తా॥ నారదమహాముని తంతుల నీడ్చి పట్టుటచే మధుర నాదము గల వీణతో గూడ భాషామయమైన నీయనంత చరితమును పలుమారు రమ్యముగా చేయాడించుచు గానము చేయుచున్నాడు. ఓ శేషా చలపతీ; నీకు సుప్రభాత మగుగాక.

(ఇంకా వుంది)

# విష్ణు సహస్రనామ స్తోత్రం



**శ్లోకం 8** **ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః**
**హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః ॥**

**64. ఈశానః** సర్వ భూతాలను సృసించేవాడు కనుక "ఈశానః" అని పిలువబడు తున్నాడు. శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో ఇలా తెలియజేస్తున్నాడు:

శ్లో॥ *ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి,*
*భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥*

(ఓ అర్జునా! ఈశ్వరుడు మాయచేత సకల జీవులను యంత్రంవలె త్రిప్పుతూ సర్వభూతాల హృదయాంత రాళాల్లో వసిస్తున్నాడు.)

శ్లో॥ *ఈశ్వరః పరమః కృష్ణః సచ్చిదానంద విగ్రహః,*
*అనాదిరాదిర్గోవిందః సర్వకారణ కారణం ॥*

**65. ప్రాణదః :** ప్రాణికోటికి ప్రాణాల నిచ్చేవాడు శ్రీమన్నారాయణుడు. ప్రాణమే మన ఉనికికి అధారం. మన శరీరం, మనస్సు, బుద్ధి ఇవి తమ కార్యాలను నిర్వహించడానికి తగిన శక్తిని సమకూర్చేది ప్రాణశక్తియే కదా!

భగవద్గీతలో : శ్లో॥ *సర్వయోనిషు కౌన్తేయ మూర్తయ స్సమ్భవన్తి యాః*
*తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రద పితా॥*

– అని భగవానుడు వచించాడు. దీని కర్థం :

'ఓ కౌంతేయా! జీవజాతులన్నీ భౌతిక ప్రకృతిలో జన్మించడం ద్వారా సాధ్యము-లవుతున్నాయి. నేనే ప్రాణ బీజాన్ని జీవరాసులకొసగే తండ్రినని తెలుసుకో!' మనకు ప్రాణాల్నిచ్చిన జగన్నాయకుని కృతజ్ఞతా భావంతో ప్రార్థించడం మన కర్తవ్యం.

**63. ప్రాణః :** ప్రాణశక్తి స్వరూపుడైనవాడు గనుక శ్రీమన్నారాయణుడు 'ప్రాణః' అని పిలువబడుతున్నాడు. విద్యుచ్ఛక్తి లేకుండ పంఖా, ఇస్త్రీపెట్టె, టెలివిజన్ వంటి సాధనాలు పని చేయలేవు. అలాగే భగవంతుడు ప్రాణశక్తియై మనందరికీ చైతన్యానిస్తున్నాడు.



శ్లో॥ *సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ,*
*వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్త కృద్వేద విదేవ చాహమ్॥*

(శ్రీకృష్ణుని వాక్యం: 'నేను ప్రతివ్యక్తి హృదయ మందు నెలకొనియున్నాను. నానుండియే జ్ఞాపకశక్తి, జ్ఞానం, మరపు కలుగుతాయి. వేదాలచేత తెలియబడే వాడను నేనే! వేదాంతాలను (ఉపనిషత్తులను) కూర్చిన వాడను, వేదాల నెఱింగినవాడను నేనే!')

మనలోనే ప్రాణానికి ప్రాణంగా ('ప్రాణస్య ప్రాణః') నెలకొనియున్న ఆ శ్రీమన్నారాయణునికి మనస్సుమాం జలులు అర్పిద్దాం.

**67. జ్యేష్ఠః :** అన్నింటికీ – అంటే సృష్టికే ముందుండినవాడు. చాల పెద్దవాడు గనుక 'జ్యేష్ఠ'డని ఇచ్చట పిలువబడు తున్నాడు. శ్రీ వైష్ణవులు 'పెరుమాళ్ళు' – (పెరుమ్ = పెద్ద, ఆళ్ = పురుషుడు) అని పేర్కొంటారు.

**68. శ్రేష్ఠః :** సర్వోత్తముడు శ్రీమన్నారాయణుడు. ఆయనకు అన్నీ తెలుసు. ఎక్కడ మంచి ఉందో అక్కడ ఆయన ఉనికి ఉత్కృష్టంగా ప్రకటింపబడుతుంది. ఉత్తమమైన చిత్రాన్ని [illegible] చిత్రకారుడు, చక్కని శిల్పాలను చెక్కే శిల్పి, మంచి నాట్యం చేసే నర్తకి – ఇట్టి కళాకారులకు నైపుణ్యం శ్రీమన్నారాయణుని అనుగ్రహం వల్లనే ప్రాప్తిస్తుంది.

శ్లో॥ **యద్యద్విభూతిమ త్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజో ఽంశ సంభవమ్ ॥**

– సంపన్నములు, సుందరములు, వైభవోపేతములు అంతా తన తేజస్సులోని ఒక అంశం నుండియే ఉద్భవించాయని శ్రీకృష్ణుడు తెలియజేస్తున్నాడు. శ్రేష్ఠులందరికీ శ్రేష్ఠు[illegible] లోకరక్షకుని ధ్యానిస్తే, మనకు మనం చేసే కార్యాల ద్వారా మనకు శ్రేష్ఠత కలుగుతుంది.

**69. ప్రజాపతిః :** సమస్త ప్రజలకు పతియై 'ప్రజాపతి'యని పిలువ బడ్డాడు. [illegible]ను పుట్టించి, రక్షించేవాడూ అతడే!

*'బ్రహ్మాండమే ఉయ్యాలగా – వేదాలు గొలుసులుగా*
*జలరాశి పానుపుగా – ఆదిశేషుడు గొడుగుగా'*

గలిగి శ్రియఃపతి అందర్నీ కాపాడుతుంటాడు.



# మంచి కాపాడుతుంది

"ఆ రిజిష్టర్ వుత్తరం ఎక్కడి నుండి వచ్చింది. దాన్ని చదివినప్పటి నుండి విచారంతో వున్నారు. ఏమైంది నాకు చెప్పండి" అంటూ ప్రియ కాఫీ చంద్రకాంత్‌కి అందించింది.

"హైద్రాబాద్ నుండి రంగనాథ్ ఆ వుత్తరం పంపించాడు. ఆ బాకీ పైకం పది రోజులలో తీర్చకపోతే, మన ఇంటిని స్వంతం చేసుకుంటాడట" అన్నాడు బాధతో చంద్రకాంత్.

"మీ నాన్న చేసిన అప్పుకు మీరు అనవసరంగా బాధపడుతున్నారు. అయినా మామగారు ఎందుకు అంత అప్పు చేసారు. ఇపుడు ఆయన హాయిగా వెళ్ళిపోయారు. మనకి కష్టాలు" అన్నది ప్రియ.

"అసలు సంగతి తెలియకుండా మాట్లాడ వద్దు. నీకు అంతా వివరంగా చెబుతాను. ఐదు సంవత్సరాల ముందు అప్పటికి ఇంకా మన వివాహం కాలేదు. మా అమ్మకి గుండె ఆపరేషన్ చేయడానికి రెండు లక్షలు కావలసి వచ్చింది. ఆ సమయంలో మా నాన్న వద్ద అంత డబ్బు లేదు. నాకు అప్పటికి ఇంకా ఉద్యోగం రాలేదు. ఆ సమయంలో రంగనాథ్ వడ్డీకి డబ్బులు అప్పుగా ఇస్తాడని తెలుసుకున్న మా నాన్న రంగనాథ్ వద్దకు వెళ్ళి అప్పు అడిగాడు. రంగనాథ్ మా ఇంటి పత్రాలు తాకట్టు పెట్టుకుని రెండు లక్షలు ఇచ్చాడు. అవసరంలో మా నాన్న తెల్ల కాగితంపై సంతకం చేసి ఇచ్చాడు. ఆ తరువాత మా అమ్మకి ఆపరేషన్ చేయించాం.

ఆ తరువాత సంవత్సరంలో మా అమ్మ చనిపోయింది. మా నాన్న రంగనాథ్‌కి సక్రమంగా నెల నెల వడ్డీ ఇస్తూ వచ్చాడు. ఇపుడు రెండు

ఎమ్. అనన్య, హైద్రాబాదు



నెలల క్రితం మా నాన్న చనిపోయిన తరువాత నేను వడ్డీ తీసుకుని రంగనాథ్‌కి ఇచ్చాను. కానీ అతను తీసుకోలేదు.

రంగనాథ్ అసలు డబ్బు ఇవ్వమన్నాడు. రెండు లక్షలు ఒక్కసారిగా ఇవ్వడం నా వల్ల కాదని నేను అనడంతో రంగనాథ్ కోపంతో మా నాన్న పది లక్షలు అప్పు తీసుకున్నారని, మా నాన్న సంతకంతో వున్న స్టాంప్ పేపర్స్ చూపించాడు. నాకు కోపం వచ్చి అంతా మోసమని, మా నాన్న రెండు లక్షలు మాత్రం అప్పు తీసుకున్నారని గట్టిగా వాదించాను. కాని రంగనాథ్ మా నాన్న తీసుకున్నది పది లక్షలని. రెండు నెలలో డబ్బు ఇవ్వక పోతే మన ఇంటిని స్వతం చేసుకుంటానని చెప్పాడు. నేను ఎంతో ప్రాధేయపడ్డాను. కానీ ఆ నీచుని మనసు కరగలేదు. నేను బాధతో తిరిగి వచ్చేసాను. నీకు చెబితే నువ్వు ఇంకా బాధపడతావని చెప్పలేదు. ఇపుడు పది రోజులలో డబ్బు ఇవ్వమని వ్రాసాడు. ఏం చేయాలో నాకు అర్థం కాలేదు" అంటూ చంద్రకాంత్ తల పట్టుకున్నాడు.

"మీరు బాధపడకండి. నేను ఆ రంగనాథ్‌తో మంచిగా మాట్లాడుతాను. వాడి మనసును మారుస్తాను. ఎప్పటికి న్యాయం ధర్మం గెలుస్తుంది. మనం మరోసారి ప్రయత్నించడంలో తప్పులేదు. ఈ రాత్రి రైలులో హైద్రాబాద్ వెళదాం రండి" అన్నది ప్రియ.

"ప్రియా! రాత్రి ప్రయాణం మంచిది కాదు. రేపుదయం రైలులో వెళదాం" అన్నాడు చంద్రకాంత్.

"అనుకున్న వెంటనే మనం బయలుదేరాలి. నాకు ఇది మంచి సమయంగా అనిపిస్తుంది. మీరు ఏమీ ఆలోచించకండి పదండి" అన్నది



ప్రియ. ప్రియ కొంచెం ధైర్యవంతురాలు. చాలా సార్లు భర్త వల్ల కాని పనిని సాధించింది. ఆ నమ్మకం చంద్రకాంత్‌కి ధైర్యమయింది. ఆ రాత్రికి బయలు దేరి, హైద్రాబాద్ వెళ్ళే రైలు ఎక్కారు. వారి అదృష్టవశాత్తూ వారు ఎక్కిన బోగీలో దాదాపు అన్ని సీట్లు ఖాళీగా వున్నాయి. రాత్రి కావడం వలన అందరూ నిద్రపోతున్నారు. ఎదురెదురుగా వున్న సీట్లలో ఇద్దరూ కూర్చున్నారు. రైలు కదిలింది.

అప్పుడు టాయిలెట్ నుండి ఒక వ్యక్తి వచ్చి వారికి ఎదురు పైన వున్న సీటులో కూర్చుంటూ, "మీరు ఎక్కడికి వెళుతున్నారండీ" అడిగాడు.

చంద్రకాంత్‌కి ఆ కొత్త వ్యక్తితో మాట్లాడడం ఇష్టం లేకపోయినా చెప్పాడు. వెంటనే ఆ వ్యక్తి "నేను హైద్రాబాద్‌కి వెళుతున్నాను. నా పేరు



కృష్ణకుమార్. మీరు తప్పుగా అనుకోకండి. నాకు ఎవరితోనైనా మాట్లాడుతుండాలి. ఈ బోగీలో అందరూ నిద్రపోతూ వున్నారు. నాతో కొంచెం మాట్లాడుతుంటారా. నిద్ర రావడం లేదు" అన్నాడు.

చంద్రకాంత్ ఏదో చెప్పబోతుండగా ప్రియ కోపంతో, "నాకు నిద్ర వస్తుంది. మీ మాటలు కాస్తా నిలుపుతారా. ముందు ఆ లైట్ ఆర్పండి" అనడంతో అందరూ పడుకున్నారు. మంచి నిద్రలో వున్న చంద్రకాంత్‌కి ఎవరో తట్టి లేపడంతో వులిక్కిపడి లేచాడు. ఎదురుగా కృష్ణకుమార్ నిలబడి వుండంతో కోపంగా చూసాడు.

"సారీ. మిమ్మల్ని నిద్రలేపినందుకు తప్పుగా అనుకోకండి. నాకు విపరీతంగా దగ్గు వస్తుంది. గుండె అంతా పట్టినట్లు నొప్పిగా వుంది. మీ వద్ద మంచి నీళ్ళు వుందా" అడిగాడు కృష్ణకుమార్.

"నేను మంచి నీళ్ళు తీసుకురాలేదు. రైలు ఆగుతుంది కదా. ఏదో స్టేషన్ వచ్చినట్లుంది. క్రిందికి దిగి తీసుకోండి" అన్నాడు చంద్రకాంత్.

"అలాగే నేను మంచి నీళ్ళు బాటిల్ తీసుకు వస్తాను. అంతదాకా ఈ బ్రీఫ్‌కేసు జాగ్రత్తగా చూసుకోండి" అంటూ కృష్ణకుమార్ క్రిందికి దిగాడు.

అపుడు మరో ప్రయాణీకుడు లైట్ ఆన్ చేసి, అతని వస్తువులు తీసుకుని దిగాడు. చంద్రకాంత్‌కి తిరిగి నిద్రరాలేదు. క్రిందికి దిగిన కృష్ణకుమార్ ఇంకా రాకపోయేసరికి, ఆ బ్రీఫ్‌కేసును అటు ఇటూ చూడసాగాడు. ముందు వైపు కృష్ణకుమార్ ఇంటి అడ్రసు వున్న కార్డు చూసి అదిరిపడ్డాడు.

ఆ కార్డులో కృష్ణకుమార్ సన్నాఫ్ రంగనాథ్ అని రంగనాథ్ విలాసం వుంది. అంతలో నిద్ర పోతున్న ప్రియ లేచి, భర్తని నిద్రపోలేదెందుకని అడిగింది.

చంద్రకాంత్ భార్యకి అంతా చెప్పి, "కృష్ణ కుమార్, మనల్ని మోసం చేస్తున్న రంగనాథ్ కొడుకు. వీడు ఎవర్ని మోసం చేసి, ఇందులో ఏం తీసుకు వెళుతున్నాడో" అంటూ ఆ బ్రీఫ్ కేసు తెరిచాడు. లోపల రెండు జతల బట్టలు, సొంపు, టూత్ బ్రష్, పేస్ట్‌తో పాటు రెండు లక్షల రూపాయలు వుంది. చంద్రకాంత్ ఆ డబ్బులు పైకి తీసి, "ప్రియా! ఇందులో రెండు లక్షలు వున్నాయి" అన్నాడు.

"ఎవరో డబ్బులు మనకెందుకండి ముందు దాన్ని లోపల పెట్టండి" అని ప్రియ అనడంతో,





చంద్రకాంత్ డబ్బులు లోపల పెట్టి, "ప్రియా! వీడు ఎవరో కాదు. మనల్ని మోసం చేసిన రంగనాథ్ కొడుకు. తండ్రి మనల్ని మోసం చేసినపుడు, మనం కొడుకుని మోసం చేయడంలో తప్పులేదు" అన్నాడు.

"అది చాలా తప్పు. అలాంటి ఆలోచనలు మనకి రాకూడాదు. ముందు క్రిందకు దిగిన వ్యక్తి ఇంకా ఎందుకు రాలేదో చూడండి రైలు కదల బోతుంది" అని ప్రియ అనడంతో చంద్రకాంత్ క్రిందికి దిగాడు. చంద్రకాంత్‌కి కొంతదూరంలో గుంపుగా జనం వున్నారు ఏం జరిగిందో చూసి వద్దామని అటు వెళ్ళాడు. అక్కడ నేల మీద కృష్ణకుమార్ పడి వున్నాడు. ఏం జరిగిందని ఒక వ్యక్తిని అడిగాడు.

"ఆ వ్యక్తి ఎవరో తెలియదు సార్. నీళ్ళ బాటిల్ తీసుకుని వస్తూ వున్నట్టుండి క్రిందపడి పోయాడు. మేము అతని ముఖంపై నీళ్ళు చిలకరించాం. కానీ లేవలేదు. ఎవరో డాక్టర్ వచ్చి, అతన్ని పరిశీలించి, అతను గుండె ఆగి చనిపోయినట్లు చెప్పారు. పాపం ఈ వ్యక్తి ఎవరో? ఎక్కడికి వెళ్ళాలో" అని అంటూండగా చంద్ర కాంత్ వేగంగా వచ్చి రైలు ఎక్కాడు. రైలు కదిలింది.

అంతలో ప్రియ కంగారుగా, "ఆ వ్యక్తి ఏమైనాడు. రైలు వెళుతుందే" అనడిగింది.

చంద్రకాంత్ నెమ్మదిగా, "ఆ వ్యక్తి గుండె ఆగి చనిపోయాడు" అని అనడంతో ప్రియ, "అయ్యో పాపం ఈ బ్రీఫ్‌కేసు ఇక్కడే వుండి పోయిందే. ఇప్పుడేం చేయాలి" అన్నది.

"ప్రియా! నువ్వు అనవసరంగా కంగారు పడకు. ఆ భగవంతుడు మనకి మంచి దారి చూపించాడు. మనం ఎవరినీ మోసం చేయకుండా, రెండు లక్షలు తీసుకోమని మన ముందు వుంచాడు. ఈ డబ్బు తీసుకు వెళ్ళి రంగనాథ్‌కి ఇస్తే వాడు మంచిగా మారడానికి అవకాశం వుంది" అన్నాడు చంద్రకాంత్.

"ఇది దేవుడు ఇచ్చి డబ్బు ఎలా అవుతుంది. ఒకరకంగా ఇది దొంగతనంతో సమానం. మిమ్మల్ని నమ్మి ఆ వ్యక్తి ఇది ఇచ్చాడు. దీన్ని మనం తీసుకోవడం చాలా దారుణం. ఇందుకు నేను సమ్మతించను" అన్నది ప్రియ.

"ఇందులో మనం మోసం చేసినట్లు ఎలా అవుతుంది. దీన్ని మనం తీసుకోకుండా ఇక్కడే వదిలి వెళితే ఈ డబ్బు అతడి ఇంటికి వెళ్ళదు.



ఎవరో తీసుకుంటారు. దానికి మనం తీసుకుంటే మంచిది కదా! ఆ రంగనాథ్ మనల్ని మోసం చేసాడు. దానికి బదులు మనం అతడ్ని మోసం చేయడంలో తప్పులేదు. నువ్వు డబ్బు ఇవ్వకుండా రంగనాథ్‌తో మాట్లాడి ప్రయోజనం లేదు. అదే ఈ డబ్బు ఇస్తే వాడు మనతో మంచిగా మాట్లాడ గలడు. నా మాట విను" అన్నాడు చంద్రకాంత్.

"మీరు ఏం చెప్పినా నాకు సమ్మతం లేదు" అంటూ ప్రియ కోపంగా తల తిప్పుకుంది.

"ప్రియా! మనం ఇంటికి వెళ్ళి తీరికగా మాట్లాడుకుందాం. ఇపుడు మనం హైద్రాబాద్ వెళ్ళడం మంచిది కాదు. వచ్చే స్టేషన్‌లో దిగి, మన వూరికి వెళ్ళిపోదాం" అన్నాడు చంద్రకాంత్.

అరగంటలో రైలు ఓ స్టేషన్‌లో ఆగడంతో ఇద్దరూ దిగి, స్టేషన్ బయటికి వచ్చి బస్సు ద్వారా వారి వూరు చేరారు. అక్కడ స్టేషన్‌లో చనిపోయిన కృష్ణకుమార్ జేబులో పర్సులో వున్న విలాసం చూసి, రంగనాథ్‌కి ఆ సంగతి తెలిపారు. రాత్రికి రాత్రి రంగనాథ్ ఏడుస్తూ వచ్చి కొడుకు శవాన్ని కారులో తీసుకు వెళ్ళాడు.

కొడుకు చనిపోవడంతో రంగనాథ్ పూర్తిగా మారిపోయాడు. అతనికున్నది ఒక్క కొడుకు. అతనే చనిపోవడంతో ఎవరికోసం సంపాదించాలి. ఎందుకు ఆస్తులు కూడబెట్టాలి అని ఆలోచించాడు. అదీ కాకుండా అతని భార్య బాగా తిట్టిపోసింది. "వూళ్ళో అందరిని మోసం చేసి సంపాదిస్తున్నందువలన దానిని అనుభవించడానికి వున్న ఒక్కకొడుకు పోయాడు. ఇకపై మారండి" అన్నది.

"అవును. నా తప్పు తెలిసింది. ఇన్ని రోజులు నేను చేసిన మోసాలు తలచుకుంటే నాకే సిగ్గనిపిస్తుంది. అయినా ఇపుడు తెలుసుకుని ఏం లాభం. నా కొడుకుని బలి చేసుకున్నాను. ఇంతవరకు నేను మోసం చేసి వసూలు చేసిన డబ్బులు తిరిగి ఇచ్చేస్తాను. ఆ రోజు మన కృష్ణకుమార్ తనతో రెండు లక్షలు తీసుకు వస్తున్నట్లు ముందుగా నాకు ఫోన్ చేసాడు. కానీ వాడి శవం ప్రక్కన పెట్టెలేదు. వాడి వద్ద డబ్బు లేదు. ఆ డబ్బు ఏమైందో! డబ్బు పోతేపోయింది. కానీ మన వాడి ప్రాణం తిరిగి రాదు కదా!" అని వాపోయాడు. వారం రోజుల తర్వాత చంద్రకాంత్ రంగనాధ్ వద్దకు వెళ్ళి, ఆయన వ్రాసిన వుత్తరం అందిందని, ప్రస్తుతం తన వద్ద అంత డబ్బు లేదని చెప్పాడు.



రంగనాధ్ బాధతో "చంద్రకాంత్! నన్ను క్షమించు. ఇన్ని రోజులు నేను చేసిన మోసాలకు నా కొడుకు అన్యాయంగా బలయ్యాడు. ఇక అన్యాయ సంపాదన నాకు అవసరం లేదు. మీ నాన్న నా వద్ద తీసుకున్నది రెండు లక్షలు మాత్రమే. ఆ డబ్బు నీ వీలు కుదిరినపుడు ఇవ్వు. పర్వాలేదు" అంటూ లోపలికి వెళ్ళి చంద్రకాంత్ నాన్న వ్రాసి ఇచ్చిన పత్రాన్ని చింపి పారేసి, అతని ఇంటి పత్రాలు ఇచ్చేసాడు.

చంద్రకాంత్ ఆశ్చర్యపోయి, తన ఇంటి పత్రాలు తీసుకుని ఇంటికి వచ్చి భార్యతో అంతా చెప్పి ఆనందపడ్డాడు.

అదివిని ప్రియ, "చూసారా, మనం మంచిగా వుంటే అంతా మంచిగా జరుగుతుంది. పచ్చి మోసగాడుగా వున్న రంగనాధ్ మంచిగా మారాడు. మంచిగా వున్న మీరు దొంగగా మారడానికి ప్రయత్నించారు. మన మంచి తనం మనల్ని కాపాడుతుంది" అన్నది.

"అంతా బాగుంది. రైల్లో దొరికిన ఆ రెండు లక్షలు మనం వాడుకోకూడదని అంటున్నావు. మరి దాన్ని ఏం చేయాలి. ఏదైనా అనాథ ఆశ్రమాలకు విరాళంగా ఇద్దాము" అన్నాడు చంద్రకాంత్.

"అత్త సొమ్ము అల్లుడు దానం చేసినట్లు రంగనాధ్ డబ్బును మీరు విరాళంగా ఎలా ఇస్తారు. అది మంచిది కాదు. ఆ డబ్బు ఇవ్వండి. ఇంకా రంగనాథ్‌కు మంచి బుద్ధి వచ్చేలా చేస్తాను" అంటూ ప్రియ రెండు లక్షలు తీసుకుంది.

రంగనాధ్ పూర్తిగా వడ్డీ వ్యాపారం మానేసాడు. ఎక్కువ వడ్డీ తీసుకున్న డబ్బు అంతా



తిరిగి అందరికి ఇవ్వడంతో, అందరూ ఆశ్చర్యపోయారు.

ఒక రోజు రంగనాథ్ పేరున పార్సిల్ కొరియర్‌గా రావడంతో అతని భార్య భయపడింది.

రంగనాథ్ నవ్వుతూ, "పిచ్చిదానా! నేను చెడ్డవాడిగా వున్నపుడు లేనిభయం ఇపుడు ఎందుకు వచ్చింది. ఇందులో ఏదైనా బాంబు పెట్టి నన్ను చంపడానికి ప్రయత్నిస్తున్నారని అనుకుంటున్నావా. ఇపుడు నాకు శత్రువులు ఎవరూ లేరు" అంటూ ఆ పార్సిల్‌ను విప్పాడు.

లోపల రెండు లక్షల రూపాయల నోట్లతో పాటు ఒక వుత్తరం వుంది.

"అరె! ఎవరో రెండు లక్షలు నాకు పంపారు. ఆశ్చర్యంగా వుందే." అనుకుంటూ రంగనాథ్ వుత్తరం చదివాడు.



"రంగనాథ్! ఈ రెండు లక్షలు నీ కొడుకు తీసుకుని వస్తున్న బ్రీఫ్‌కేసులో వున్న డబ్బు. ఆ రోజు నేను నీ కొడుకుతో పాటు అదే రైలులో ప్రయాణం చేస్తున్నాను. నా కళ్ళ ముందే నీ కొడుకు స్టేషన్‌లో గుండె పోటుతో మరణించాడు. నువ్వు మోసం చేసిన వారిలో నేను ఒకడిని. ఆ కోపంతో రెండు లక్షలు నాతో తీసుకు పోయాను. కానీ నీ కొడుకు మరణానంతరం నువ్వు మంచివాడిగా మారిపోయావని తెలిసింది. మంచివాడిగా వున్న నేను నీ పాపపు సొమ్ము దొంగలించి చెడ్డవాడనవడం ఇష్టంలేక, నీ డబ్బుని తిరిగి పంపుతున్నాను.

ఇట్లు శ్రేయోభిలాషి

అది విన్న అతని భార్య, "చూసారా! మీ మంచితనం వలనే, మీరు పోయిందనుకున్న డబ్బు మిమ్మల్ని వెదక్కుని మీ ఇంటికి వచ్చింది. మనం ఎంత మంచి చేస్తే మనకి అంత మంచి జరుగుతుంది. నిజంగా ఆ దేవుడు వున్నాడు" అన్నది.

"నువ్వన్నది నిజం. నీతి నిజాయితీతో వుంటే నాకు ఎంతో ఆనందంగా సంతోషంగా వుంది. ఇపుడు నా ఆరోగ్యం ఎంతో బాగుంది. ఇపుడు వద్దన్నా డబ్బు మన వద్దకి వస్తున్నది" అన్నాడు రంగనాథ్.

సరిగ్గా ఆ సమయంలో చంద్రకాంత్ "ప్రియా! రెండు లక్షలు రంగనాథ్‌కి పంపించావు. ఇపుడు మనం అతని అప్పు ఎలా తీర్చాలి. మంచి కాపాడుతుంది అన్నావు ఏం కాపాడింది" అన్నాడు.

"ఇది మరీ బాగుంది. ఆ రెండు లక్షలు మీ అమ్మ ఆపరేషన్‌కు అప్పు తీసుకున్నారు. ఆ డబ్బు మీరు తీర్చాలి. కానీ ఎవరైనా మీకు తెచ్చి ఇస్తారా. మంచిగా వున్నంత మాత్రానా అటువంటి విచిత్రాలు జరుగుతాయని ఎదురు చూడకండి. కానీ ఆ దేవుడు మనల్ని రక్షిస్తాడు. ఆ నమ్మకం వుంది. మీరు రంగనాథ్ డబ్బును న్యాయంగా పంపి అతనికి సహాయం చేసారు. అలాగే మీకు ఎక్కడ నుండైనా రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మీరు ధైర్యంగా వుండండి" అన్నది ప్రియ.

ఆ సమయంలో ఒక వ్యక్తి రావడంతో చంద్రకాంత్ "ఏం ప్రసాద్! ఆ కేసు ఎలా సాగుతుంది. ఇంకా దేనికైనా డబ్బు కట్టాలా" అన్నాడు.



"చంద్రకాంత్! నీకు సంతోషమైన వార్త చెప్పాలని వచ్చాను. పది సంవత్సరాలుగా జరుగుతున్న కేసులో మీరే గెలిచారు. పాపం మీ నాన్న ఈ కేసు కొరకు చాలాసార్లు కోర్టుకు వచ్చారు. కానీ ఆయన చనిపోయిన తరువాత మీ కేసు గెలిచింది" అన్నాడు ప్రసాదు.

చంద్రకాంత్ సంతోషపడకుండా, "కేసు గెలిచిన వలన నాకు లాభం ఏముంది. వాళ్ళే వారసలుగా ఈ ఇంటి మీద హక్కు వుందని మాపై కేసు వేసారు. మేము గెలిచిన వలన నా ఇల్లు నాకు దక్కింది. వేరే లాభం ఏముంది" అన్నాడు.

"మీకు లాభం లేకుండా వుంటే ఇంత సంతోషంగా ఎలా చెబుతాను. ఇంతవరకు మీరు కోర్టు ఖర్చులు లక్ష రూపాయలు అయి వుంటుంది కదా! కోర్టు వారు మీకు ఇంత వరకు అయినా ఖర్చులు మరియు మీకు కలిగిన ఇబ్బందులకు కలిసి మొత్తం మూడు లక్షలు మీకు అందజేయాలన్న తీర్పు చెప్పింది. ఇంకో వారం రోజులలో మీకు ఆ డబ్బు అందుతుంది" అంటూ కొన్ని పత్రాలు ఇచ్చి ప్రసాదు వెళ్ళిపోయాడు.

చంద్రకాంత్ సంతోషంతో ప్రియ వంక చూసాడు. "నేను ముందే చెప్పాను కదా! ఆ దేవుడున్నాడు. మనల్ని సమయానికి రక్షిస్తాడని. అదే జరిగింది. మీరు రంగనాథ్‌కి మంచి చేసారు. ఆ భగవంతుడు ఈ కేసు గెలిపించి సమయానికి మీకు డబ్బులు ఏర్పాటు చేసాడు. రెండు లక్షలు వచ్చిన వెంటనే ముందు రంగనాథ్ వద్దకు వెళ్ళి అప్పు తీర్చేయండి" అన్నది.

"ప్రియా! ఈ రోజు నేను సంతోషంగా వున్నాను. ఆ రోజు డబ్బు చూసి ఒక్క క్షణం చెడుగా మారాను. నువ్వు దగ్గర వున్నందువలన మంచిగా వుండిపోయాను. ఆ మంచి ఇంత గొప్ప మేలు చేస్తుందని అనుకోలేదు. మనం చేస్తున్న పుణ్యం, మంచి, మన వెంట నుండి మనల్ని కాపాడుతుందన్నది నిజం. ఇది నమ్ముతాను" అంటూ చంద్రకాంత్ ఆఫీసుకు సంతోషంతో బయలుదేరాడు.





# చదువు

గోపయ్య వేగంగా బడిలోకి వచ్చి మాస్టారుతో, "మా రమణ ఎక్కడ?" అని అడగడంతో మూలలో కూర్చుని వున్న రమణ తన తండ్రిని చూసి భయంతో వణికిపోయాడు.

మాస్టారు నెమ్మదిగా "గోపయ్యా? ఎందుకంత కోపంగా వున్నావు. రమణ చదువుకుంటున్నాడు. చదువు ఎంతో విలువైనది. వీళ్ళు ఇప్పటి నుండి కష్టపడి చదివితే మంచి ప్రయోజకులవుతారు" అన్నారు.

"అం... వాడు చదువుకుంటూ ఇక్కడ కూర్చుంటే పైసలెలా వస్తాయి? నేను మీ మాటలు వినడానికి రాలేదు. నా కొడుకుని తీసుకుపోవడానికి వచ్చాను" అంటూ గోపయ్య, మూలలో కూర్చున్ని వున్న రమణని చేయి పట్టుకుని లాక్కెడుతూ, "ఆమీందారు గోరు పనిలోకి రమ్మంటే నువ్వు ఈడ కూకుంటావట్రా పద, మళ్ళీ ఈడకి వస్తే మక్కెలు ఇరగదంతా" అన్నాడు.

"నాకు చదువుకోవాలని వుంది. నేను ఈడనే చదువుకుంటాను" అని రమణ ఏడుస్తూ చెప్పిన గోపయ్య వినలేదు. వేగంగా వెళ్ళిపోయాడు.

గోపయ్యకి సీత అనే కూతురు వుంది. సీతకి చిన్న వయసులోనే పెళ్ళి చేసి పంపాడు. గోపయ్యకి కూతురు అంటే పంచ ప్రాణాలు. సీత భర్త దగ్గర చదవడం, వ్రాయడం నేర్చుకుని అపుడపుడు తండ్రికి ఉత్తరాలు వ్రాసేది. కానీ గోపయ్యకి చదవడం రాదు. అందువలన ఉత్తరం తెచ్చిన పోస్టుమాన్ ద్వారా ఆ వుత్తరాన్ని చదివించుకుని ఆనందపడేవాడు.

ఆ రోజు గోపయ్య పొలం పనులు ముగించుకుని ఇంటికి రావడంతో, ఇంటిలో వుత్తరం పడి వుంది. అది తన కూతురు వ్రాసినది అని గ్రహించాడు. కాని చదవడానికి పోస్టుమేన్ లేడు. వారం రోజుల తర్వాత మరో వుత్తరం కూతురి వద్ద నుండి వచ్చింది.

మరుసటి వారంలో కూతురి వద్ద నుండి తిరిగి వుత్తరం రావడంతో గోపయ్య కంగారుపడ్డాడు. ఏదో ముఖ్యమైన విషయం వుంటుందని మాస్టారు వద్దకు వెళ్ళి చదవమన్నాడు.

మాస్టారు చదివి, "గోపయ్యా! చదువుకోనందు వలన నీకు ఎన్ని ఇబ్బందులు. నీ కొడుకుని చదివించక పొరపాటు చేసావు" అన్నాడు.

"మొదటి వుత్తరంలో నీ కూతురు నెల తప్పింది అన్న సంతోష వార్తను తెలిపింది. కానీ దానికి బదులు నువ్వు నీ సంతోషాన్ని తెలుపుతూ బదులు వ్రాయకపోవడంతో తిరిగి మరో వుత్తరం వ్రాసింది. దానికి బదులు రాలేదు. అందువలన కోపంగా మూడో వుత్తరం వ్రాసింది. నీ సంతోషాన్ని వుత్తరం ద్వారా తెలపనందున ఆమె అత్తమామలు భర్త చాలా కోపం చేసుకున్నారట. ఈ వుత్తరానికి నువ్వు బదులు వ్రాయకపోతే [illegible] వ్రాసింది" అన్నారు.

"అయ్యో ఎంత పని జరిగింది. నా బంగారు తల్లి నెల తప్పింది అన్న సంగతి తెలుసుకోలేక పోయాను. నాకు చదువు రానందువలన ఇంత కష్టం జరిగింది. నా బంగారు తల్లిని ఏడిపించాను" అన్నాడు గోపయ్య.

"గోపయ్యా! చదువు దేవుడిచ్చిన వరం. దాన్ని నిర్లక్ష్యం చేస్తే ఇలా జరుగుతుంది. ఇప్పటికైనా నీ కళ్ళు తెరచి నీ కొడుకుని చదివించు. వాడు చదువుకుంటే నీకు ఉత్తరాలు చదివి పెడతాడు. ఉత్తరాలు వ్రాసి ఇస్తాడు. నువ్వు ఇంకొకరి కొరకు ఎదురుచూడ నవసరం లేదు. ముందు నీ కూతురి వద్దకు వెళ్ళు. ఆ తరువాత నీ కొడుకుని నా వద్దకు చదువు కునేందుకు పంపు" అన్నారు మాస్టారు.

"నాకు బుద్ధి వచ్చింది. నా కొడుకుని రేపే మీ వద్దకు పంపుతాను" అన్నాడు గోపయ్య.

ఎ. లలిత, కాకినాడ



## భారతరత్న బిరుదును పొందిన ప్రముఖులు

1954 : డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్
చక్రవర్తి రాజగోపాలచారి
డాక్టర్ సి.వి. రమణ

1955 : డాక్టర్ భగవాన్‌దాస్
డాక్టర్ యమ్. విశ్వేశ్వరయ్య
జవహర్‌లాల్ నెహ్రూ

1957 : గోవిందవల్లభ పంత్

1958 : డాక్టర్ డి.కె. కార్వే

1961 : డాక్టర్ బి.సి.రాయ్
పురుషోత్తమ్ దాస్‌టాండన్

1962 : డాక్టర్ రాజేంద్రప్రసాద్

1963 : డాక్టర్ జాకిర్ హుస్సేన్
డాక్టర్ కె.వి. కాన్

1966 : లాల్ బహదూర్ శాస్త్రి

1971 : శ్రీమతి ఇందిరా గాంధి

1975 : వి.వి.గిరి

1976 : కె. కామరాజు

1980 : మథర్ థెరిస్సా

1983 : ఆచార్య వినోభాభావే

1987 : ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్

1988 : యం.జి. రామచంద్రన్

1990 : నెల్సన్ మండేలా

1991 : మొరార్జీ దేశాయి
రాజీవ్‌గాంధీ
సర్దార్ వల్లభభాయ్ పటేల్

1992 : మౌలానీ అబ్దుల్ కలాం ఆజాత్
సత్యజిత్‌రాయ్

1997 : గుర్జారీలాల్ నందా
శ్రీమతి అరుణా అసఫ్ ఆలీ
డాక్టర్ ఎ.పి.జె. అబ్దుల్‌కలామ్

1998 : ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి
జయ ప్రకాశ్ నారాయణ్

1999 : ప్రొఫెసర్ అమర్త్యసేన్
పండిత రవిశంకర్
గోపీనాత్ బోర్‌దాలోయి

2001 : లతా మంగేష్కర్
బిస్మిల్లాఖాన్

2008 : పండిత్ భీమ్‌సేన్ జోషీ

కె. నిర్మల, హైద్రాబాద్





మినీ నవల



# భీమ



కారు హెడ్ లైట్స్ వెలుతురులో అది మనిషి ఆకారంలా కనిపించింది. ఒక్క క్షణం అదిరిపడ్డాడు. తరువాత తమాయించుకుని నెమ్మదిగా టార్చి లైట్ తీసుకుని క్రిందికి దిగి, అక్కడికి వెళ్ళాడు.

అక్కడ ఒక వ్యక్తి రక్తగాయలతో పడి వున్నాడు. తలకి, ఎదకి పెద్ద దెబ్బలు తగిలి రక్తం కారుతుంది. కాళ్ళు చేతులకు బాగా దెబ్బలు తగిలివుంది. జయశంకర్ ముందు డాక్టర్ ప్రాక్టీసు చేస్తూ తరువాత సైంటిస్ట్‌గా మారాడు. అందువలన క్రిందికి వంగి ఆ వ్యక్తిని బాగా పరిశీలించాడు. ఆ వ్యక్తి కొన వూపిరిలో వున్నాడు. ఇంకా కొద్ది గంటలలో ప్రాణాలు తప్పక పోతుందని గ్రహించాడు.

ఆ వ్యక్తికి అన్ని గాయాలు ఎలా అయిందో జయశంకర్ ఆలోచించి అర్ధం చేసుకున్నాడు. ఆ వ్యక్తి కష్టాలలో వుండి రైలు క్రిందపడి చావడానికి పట్టాలపై నిలబడి వున్నపుడు రైలు మోదిన వేగానికి, ఎగిరి తన ముందుపడి వుంటాడని గ్రహించాడు.

ఆ వ్యక్తి ప్రాణాలు కాపాడడం చాలా కష్టమని గ్రహించిన జయశంకర్ తన కారు వద్దకు వెళ్ళి సీటులో కూర్చుని కారు స్టార్ట్ చేస్తుండగా ఆయనకి ఓ సంగతి గుర్తుకు వచ్చింది.

జయశంకర్ పది సంవత్సరాలుగా కష్టపడి ఒక అద్భుతమైన మందును కనిపెట్టాడు. అది ప్రయోగించడానికి కొన్ని గంటలలో చావబోయే వ్యక్తి కావాలి. ఆరు నెలలుగా ఎంత ప్రయత్నించినా వీలు కాలేదు. అది జరగని పని అని నిర్ధారించుకున్న సమయంలో రక్తగాయాలతో పడి వున్న వ్యక్తి తన కలని నిజం చేస్తాడనుకున్నాడు.

వెంటనే జయశంకర్ కారులో నుండి క్రిందికి దిగి, డిక్కీ తెరచి అందులో వున్న పెద్ద గోనె సంచి తీసుకుని క్రింద పడి వున్న ఆ వ్యక్తిని అతి కష్టంలో సంచిలోకి ఎక్కించి, నెమ్మదిగా లాక్కుని కారులో పెట్టి, కారును ముందుకు నడిపాడు.

అరగంటలో జయశంకర్ ఇంటికి చేరి, రక్తగాయాలతో వున్న వ్యక్తిని తన లాబ్‌లోకి



తీసుకు వెళ్ళి ముందుగా ప్రత్యేక మందుతో అతని శరీరాన్ని శుభ్రపరచి, చిన్న ఆపరేషన్‌లు చేసాడు. తరువాత తాను తయారు చేసిన మందును, జంతువుల రక్తంతో కలిపి, అతని శరీరంలోకి డ్రిప్ ద్వారా ఎక్కించాడు.

కొన్ని గంటలకంతా ఆ వ్యక్తి శరీరంలో వున్న అన్ని గాయాలు మాయమైంది. మెదడు, గుండె సక్రమంగా పనిచేయసాగింది. ప్రాణ గండం నుండి ఆ వ్యక్తి పూర్తిగా తప్పించు కున్నాడు. కానీ అతని శరీరంలోని రక్తంలో జయశంకర్ ఎక్కించిన జంతువుల రక్తం ప్రత్యేకమందులు బాగా కలిసిపోయింది. అతని ఎముకలు, కండలు దృఢపడింది. సన్నగా వున్న వ్యక్తి ఇపుడు కండలు పట్టి మంచి ఆరోగ్య వంతుడుగా కనిపించడంతో జయశంకర్ సంతోషంతో, "నా శ్రమ ఫలించింది. నేను అనుకున్నట్లు ఆ మందు పని చేస్తున్నందువలన కొనవూపిరితో, గాయాలతో వున్న వ్యక్తి మంచి ఆరోగ్యవంతుడయ్యాడు. రేపు ఇంకో డోస్ ఎక్కించాలి" అనుకుని లాబ్ నుండి బయటికి వచ్చాడు.

మరునాడు జయశంకర్ లాబ్‌లోకి వెళ్ళి ఆ వ్యక్తిని పరిశీలించాడు. మార్పులేదు. మంచి నిద్రలో వున్నట్లు వున్నాడా వ్యక్తి.

జయశంకర్ అతని తలలో శస్త్ర చికిత్స చేసి, చిన్న పరికరాన్ని పెట్టాడు. ఆ తరువాత తిరిగి ఆ మందు అతని శరీరంలోకి



ఎక్కించాడు. మందు అతని శరీరంలోకి వెళ్ళిన కొన్ని క్షణాలకంతా అతని శరీరంలో రక్త ప్రసరణ వేగంగా జరగసాగింది. శక్తి పెరిగింది. శరీరం సన్నగా అందంగా తయారైంది. కాని కళ్ళు తెరవలేదు. ఆ రోజుకి మందు చాలని జయశంకర్ వెళ్ళిపోయాడు.

జయశంకర్ వరుసగా వారం రోజులు అతని శరీరంలోకి మందు ఎక్కించాడు. ఎనిమిదో రోజు జయశంకర్ లాబ్‌లోకి వెళ్ళి పడకలో ఆ వ్యక్తి కనిపించకపోవడంతో కంగారుపడి నలువైపులా చూసాడు. ఒక మూలలో నిలబడి దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. జయశంకర్ అతని వద్దకు వెళ్ళి "ఎలా వుంది నీ ఆరోగ్యం?" అడిగాడు.



ఆ వ్యక్తి జయశంకర్ వైపు పరిశీలనగా చూసి, "ఎవరు మీరు? నేనెవరు? నా ఆరోగ్యానికి ఏమైంది?" అన్నాడు.

"నన్ను మరిచావా? నేను బాస్‌ని. వారం రోజుల ముందు నీకు ఆక్సిడెంట్ జరిగితే చికిత్స చేసి బ్రతికించాను" అన్నాడు.

అపుడావ్యక్తికి ఏదో గుర్తుకు వచ్చి, "అవును మీరు నా బాస్ మీరు చెప్పినట్లు నేను వినాలి. ఇపుడు గుర్తుకు వచ్చింది. కానీ నా పేరు అసలు గుర్తుకు రావడం లేదు" అన్నాడు.

జయశంకర్ ఆ క్షణంలో వేగంగా ఆలోచించి, "నీ పేరు భీమ. నువ్వు మహాశక్తి వంతుడవి. ఏ పని అయిన సులభంగా చేయగలవు. ఏ పని ఎలా చేయాలో నేను చెబుతాను ఇక విశ్రాంతి తీసుకో" అన్నారు.

"నా శక్తి గురించి నాకే తెలియడం లేదు. ఏదైనా కష్టపని చెప్పండి. ప్రయత్నిస్తాను" అన్నాడు భీమ.

జయశంకర్ లాబ్‌లో వున్న పెద్ద ఇనుప రాడ్ అతనికి ఇచ్చి, "భీమా! దీన్ని రెండు ముక్కలు చేయి" అన్నాడు.

భీమ ఆ రాడ్ తీసుకుని అవలీలగా క్షణంలో రెండు ముక్కలు చేసాడు. జయశంకర్ నవ్వుతూ, "నువ్వు దాని గురించి ఆలోచించకు. ఈ గది నుండి బయటికి రావద్దు. రేపటి నుండి నీకు పని ప్రారంభమవుతుంది. అంతవరకు విశ్రాంతి తీసుకో" అంటూ బయటికి వెళ్ళాడు.

మరునాడు జయశంకర్ అతడి వద్దకు వచ్చి, "భీమా! ఈ రోజు నువ్వు బ్యాంక్‌కి వెళ్ళి పది లక్షలు తీసుకురావాలి? ఎలా అన్నది వివరంగా చెబుతాను" అంటూ భీమ చెవి వద్ద చిన్న పరికరం పెట్టి, అతని కళ్ళకు కూలింగ్ గ్లాస్ వేసుకోమని చెప్పి చేతికి సూట్‌కేసు ఇచ్చి తనతో తీసుకు వెళ్ళాడు.

కారులో డ్రైవింగ్ సీటులో భీమని కూర్చుండ బెట్టి జయశంకర్ ప్రక్కన కూర్చున్నాడు. "నీ మెదడులో అన్ని వివరాలు పొందుపరచి వున్నాను. నీకు అన్నీ తెలుసు. ముందు ఎ.బి.సి బ్యాంక్ వద్దకు వెళ్ళు" అన్నాడు.

భీమా బ్యాంక్ పేరు మరోసారి ఉచ్చరించాడు. మరుక్షణంలో అతని మెదడులోని



జి.పి.స్. పని చేయనారంభించి భీమకి బ్యాంక్ వెళ్ళడానికి దారి చెప్పసాగింది. భీమ కారుని వేగంగా నడిపి బ్యాంక్ ముందు ఆపాడు.

"భీమా! నీ కళ్ళకు వింత శక్తి వుంది. అందుకే కూలింగ్ గ్లాస్ తీసుకోమన్నాను. ఇపుడు నువ్వు తిన్నగా మేనేజర్ వద్దకు వెళ్ళు ఆయన ముందు కూర్చుని కూలింగ్ తీసి, "పది లక్షలు కావాలి ఈ పెట్టెలో పెట్టివ్వండి?" అడుగు. ఆ తరువాత ఏం చేయాలో నేను ఇక్కడ నుండి నీకు చెబుతాను. నీ చెవి వద్ద వున్న పరికరం ద్వారా మీ మాటలు నాకు వినిపిస్తుంది. నా మాటలు నీకు వినిపిస్తుంది. త్వరగా వెళ్ళు. ఎవరు నిన్ను అడ్డగించరు" అని జయశంకర్ చెప్పడంతో భీమ కారు దిగి బ్యాంక్‌లోకి వెళ్ళాడు.

భీమ మేనేజర్ గదిలోకి వెళ్ళాడు. ఆ సమయంలో ఆయన ఫోన్‌లో ఎవరితో మాట్లాడుతూ భీమ వైపు ప్రశ్నార్థకంగా చూసాడు.

భీమ ఆయన ముందు కూర్చుని, కూలింగ్ గ్లాస్ తీసి, "మేనేజర్! మీతో అవసరంగా మాట్లాడాలి. ముందు ఫోన్ కట్ చేయండి" అనడంతో ఆయన వెంటనే ఆ పని చేసాడు.

"ఎవరు మీరు? ఇంతవరకు నా బ్యాంక్‌లో మిమ్మల్ని చూడలేదే?" అడిగాడు మేనేజర్.

"నా సంగతి మీకనవసరం. నాకు అవసరంగా డబ్బులు కావాలి. పది లక్షలు తీసుకు



వచ్చి ఈ సూట్ కేసులో పెట్టండి" అన్నాడు భీమ.

ముందు అయోమయంగా చూసిన మేనేజర్ భీమ చూపులకు ఏదో మత్తులో వున్నట్లు అయి, బీరువా తెరచి పది లక్షలు తీసుకు వచ్చి భీమ పెట్టెలో పెట్టాడు.

భీమ పైకి లేచి, "మేనేజర్! నాకు బయటికి వెళ్ళడానికి ఐదు నిమిషాలు పడుతుంది. నువ్వు పది నిమిషాల తరువాత నా గురించి అందరికి చెప్పు. అంతవరకు ఫోన్‌లో మాట్లాడుతుండు" అంటూ వేగంగా బయటికి [illegible]డు.

జయశంకర్ కారుని భీమ [illegible]దు ఆపిన వెంటనే అతను లోపలికి ఎక్కా[illegible] మరుక్షణం కారు వేగంగా వెళ్ళిపోయింది.



పది నిమిషాల తరువాత మేనేజర్ ఈ లోకానికి వచ్చి ఏం జరిగిందో ఆలోచించాడు. అంతా ఏదో కలలా అనిపించింది. గబగబా బీరువా తెరిచి చూసాడు. అందులో పది లక్షలు తక్కువగా వుంది. అపుడు అతనికి అర్థమై పెద్దగా అరవడంతో అందరూ లోపలికి వచ్చారు. మేనేజర్ జరిగింది వివరంగా చెప్పడంతో అందరూ బయటికి పరిగెత్తి నలువైపులా చూసారు. కాని ఎవరూ కనిపించలేదు.

ఆ తరువాత పోలీసులు వచ్చారు. అంతా విచారించి, వ్రాసుకున్నారు. వచ్చిన దొంగ ఆయుధం చూపి బెదిరించకుండా పది లక్షలు ఎలా దోచుకున్నాడో అని ఆలోచించారు. ఎవరికీ ఏమి అర్థం కాలేదు. మేనేజర్ పూర్తిగా అయోమయంలో వుండిపోయాడు.

జయశంకర్ ఇంటిలో పదిలక్షలు సోఫాలో పెట్టి "అమ్మయ్యా! అంతా నేను అనుకున్నట్లు జరిగింది. ఇక ఈ భీమ ద్వారా కోట్లు సంపాదించవచ్చు. నన్ను డాక్టర్‌గా పనికి రానని నన్ను బయటికి తరిమారు. నేను సైంటిస్ట్‌గా ఎదిగాను. కష్టపడి మందు తయారు చేసి భీమ మీద ప్రయోగించి నా కోరికలు నెరవేర్చు కుంటున్నాను. సులభంగా పది లక్షలు సంపా దించాను. ఇక కోట్లు సంపాదిస్తాను" అంటూ పెద్దగా నవ్వసాగాడు.

అపుడు వీధి తలుపులు తెరచుకుని శివప్రతాప్ లోపలికి రావడంతో జయశంకర్ అదిరిపడ్డాడు. తాను అవసరంలో వీధి తలు పులు లాక్ చేయడం మరిచానని. శివప్రతాప్ లోపలికి వస్తూనే సోఫాలో వున్న డబ్బు కట్టలు చూసాడు.

శివప్రతాప్ ఆ ఏరియాలో పెద్ద దాదా. అతని క్రింద చాలా మంది రౌడీలున్నారు. పోలీసులే శివశంకర్‌ని చూసి భయపడు తుంటారు. కానీ జయశంకర్ తనకి అవసర మంటుందని ఇటువంటి వారితో స్నేహం పెంచుకున్నాడు. శివప్రతాప్ అపుడపుడు వస్తూ వుంటాడు.

జయశంకర్ తడబడుతూ, "రా! శివప్రతాప్ ఏం పని మీద వచ్చావు" అని అడగడంతో శివప్రతాప్ నోట్ల కట్టను చూస్తూ "చాలా డబ్బు కనిపిస్తుందే ఎక్కడ కన్నం వేసావు" అన్నాడు.

"అబ్బే లేదు. వూరిలో నా పొలాలు అమ్మిన డబ్బు. లెక్క చూస్తున్నాను'' అన్నాడు జయశంకర్.

"దొంగల సంగతి దొంగలకే తెలుస్తుంది. ఇది తప్పక దొంగలించిన డబ్బు అని తెలు స్తుంది. నాకు అబద్ధం చెప్పకు. నిజం చెప్పు" అని అరిచాడు వివప్రతాప్.

శివప్రతాప్ ద్వారా బయట అందరికీ తెలిస్తే తన పరువు పోతుందని జయశంకర్ అనుకుని, "శివప్రతాప్! ఈ డబ్బు సంగతి మరిచపో ఈ లక్ష తీసుకో" అని డబ్బు ఇచ్చాడు.

"జయశంకర్! నువ్వు పెద్ద దొంగతనం చేసినట్లు అర్థం అవుతుంది. మాలాంటి వాళ్ళు సులభంగా పోలీసులకు దొరికిపోతాం కానీ పెద్ద మనిషి ఆకారంలో వుండి నువ్వు ఎన్ని లక్షలు దోచుకున్న ఎవరూ కనిపెట్టరు. అందు వలన ఇప్పటికి ఇక్కడున్న డబ్బు మొత్తం నాకు ఇచ్చేయి. ఈ సంగతి ఎవ్వరికీ చెప్పను" అన్నాడు శివప్రతాప్.

జయశంకర్‌కి కోపం వచ్చింది. వాడిని చంపేయాలనుకున్నాడు. కానీ భీమా కొన్ని నిమిషాల ముందు విశ్రాంతి కొరకు లోపలికి వెళ్ళాడు. నాలుగు గంటలు వరకు బయటికి రాడు. అందువలన అతను అడిగిన డబ్బు ఇచ్చే యాలనుకుని మొత్తం పది లక్షలు అతనికిచ్చి "ఇక్కడ ఇంత డబ్బు వున్న సంగతి పూర్తిగా మరచిపో. అంతేకాదు. ఇకపై నా ఇంటికి ఎప్పటికీ రావొద్దు" అని కోపంగా అరిచాడు.

శివప్రసాద్ నవ్వుతూ బయటికి వెళ్ళిపోయాడు.





జయశంకర్ కోపంతో సోఫోలో కూర్చుని "ఇటువంటి రౌడీలతో స్నేహం చేసినందువలన ఎంత నష్టం వస్తుందో తెలుసుకున్నాడు. రేపు పెద్ద మొత్తం సంపాదించి ఈ ఇల్లు వదిలి దూరంగా ఇల్లు కొనుక్కోవాలి" అని మనసులో అనుకుంటుండగా అతని ఫోన్ మోగడంతో రిసీవర్ తీసి 'హలో' అన్నాడు.

"నేను శివప్రసాద్ మాట్లాడుతున్నాను" అని వినబడడంతో జయశంకర్ కోపంతో "నువ్వెవరో నాకు తెలియదు మర్యాదగా ఫోన్ పెట్టి నన్ను విసిగించకు" అన్నాడు.

"అవసరపడకు. ముందు నా మాటలు పూర్తిగా విను. ఇపుడే నాకు తెలిసింది. నవ్వు ఎ.బి.సి. బ్యాంక్ డబ్బులు కొల్లగొట్టావని. ఈ సంగతి ఎవరికీ చెప్పకుండా వుండాలంటే యాభై లక్షలు కావాలి" అన్నాడు.

అది విన్న జయశంకర్ అదిరిపడ్డాడు. వాడి అంతు చూడకపోతే తనని పాతాళానికి తొక్కుతాడని గ్రహించాడు. ఇపుడు ఏం చెప్పినా వినడని మంచిగా మాట్లాడి వాడిని అంతం చేయాలనుకుని పైకి నవ్వి. "శివ ప్రతాప్! ప్రస్తుతం అంత డబ్బు నా వద్ద లేదు. రెండు రోజులలో నా అసిస్టెంటు ద్వారా తప్పక పంపిస్తాను. అంతవరకు ఈ సంగతి గురించి నాకు ఫోన్ చేయవద్దు. నువ్వడిగిన డబ్బు ఇస్తాను" అని ఫోన్ పెట్టాడు.

ఆ రోజు రాత్రి జయశంకర్ భీమని పిలిచి శివప్రతాప్ ఫోటో చూపి ఏం చెయ్యాలో వివరంగా చెప్పాడు.



రాత్రి పన్నెండు గంటలకు భీమ కారులో బయలుదేరాడు. అతని మెదడులో జి.పి.ఎస్. వున్నందువలన శివప్రతాప్ ఇల్లు సులభంగా చేరుకుని, గోడ దూకి లోపలికి ప్రవేశించాడు.

మరుక్షణం రెండు కుక్కలు మొరుగుతూ అతని మీదికి వచ్చాయి. అవి మేలు జాతి కుక్కలు ఒక్క పట్టు పట్టిందంటే కేజీ కండ క్రిందపడవలసిందే. భీమ ఏమీ భయపడలేదు. ధైర్యంగా వాటిని ఎదురుకున్నాడు. ఒక కుక్కని పట్టుకుని పైకి ఎత్తి గిరిగిరా తిప్పి అవతలకి విసిరాడు. అంతే క్రిందపడిన అది లేచి రాలేదు. అంతా చూస్తున్న ఇంకొక కుక్క పిల్లిలా వెనక్కి నక్కింది. భీమ పైపుల ద్వారా ఇంటి మీదికి ఎక్కి మేడను చేరి, అక్కడ నుండి లోపల ఇంట్లోకి దిగాడు. వరుసగా గదులు కనిపించడంతో భీమ ఒక్కొక్క గది చూసుకుంటూ శివప్రతాప్ గదిని చేరుకుని మంచం మీద పడుకుని వున్న వాడిని లేపాడు.

అదిరిపడి లేచిన శివప్రతాప్ తన ముందు నిలబడిన వ్యక్తి ఎవరా?" అని దిండు క్రింద వున్న కత్తిని తీయబోయాడు.

భీమ అతని చేయి గట్టిగా పట్టుకుని "అవసరపడకు. నేను జయశంకర్ అసిస్టెంట్‌ని" అన్నాడు.

"అందుకని ఇంత అర్ధరాత్రి ఇంటికి వస్తావే? అయినా ఇంట్లోకి ఎలా వచ్చావు" అనరిచాడు శివప్రతాప్.







"ఆ వివరాలు నీకనవసరం. ముందు నా బాస్ వద్ద నువ్వు తీసుకున్న పది లక్షలు ఇవ్వు" అన్నాడు భీమ.

"నేనెవరో తెలుసా? నీ అంతు చూస్తాను" అంటూ శివప్రతాప్ కత్తిని బయటికి తీసాడు.

భీమ తన కూలింగ్ గ్లాస్ తీసి, "నా కళ్ళు చూసి మాట్లాడు. ముందు ఆ కత్తిని దూరంగా విసిరి పది లక్షలు తీసుకురా" అన్నాడు.

శివప్రతాప్ మంత్రముగ్ధుడిలా కత్తిని దూరంగా విసిరి లోపల నుండి డబ్బును సూట్‌కేసుతో తీసుకు వచ్చి భీమకి ఇచ్చాడు.

"నువ్వు వెళ్ళి నీ బాత్‌రూమ్‌లో వాటర్ టబ్బులో కూర్చుని దాని నిండుగా నీరు నింపు" అని భీమ అనడంతో శివప్రతాప్ స్నానం చేసుకునే డబ్బులో కూర్చుని నిండుగా నీరు నింపాడు.

తరువాత భీమ దగ్గరికి వచ్చి, "నువ్వు అలాగే నీటిలో మునిగి వుండిపో పైకి రావొద్దు" అన్నాడు. శివప్రతాప్ అలాగే నీటిలో మునిగాడు. కొన్ని నిమిషాలకి శవంగా లేచాడు. అది చూసి భీమ తృప్తిగా నవ్వి, "ఇక మా బాస్ సంగతి ఎవ్వరికీ తెలియదు. తెలిసిన వీడు చచ్చాడు" అంటూ బయటకి నడిచాడు.

వారం రోజుల తరువాత జయశంకర్ ఏదో పని మీద బయటికి వెళ్ళాడు. ఆ సమయంలో భీమ నిద్రపోతున్నాడు. అందువలన జయశంకర్ బయటికి వెళ్ళాడు.

కానీ భీమ ముందుగా నిద్రలేచాడు. అతడు లేచిన వెంటనే సాదారణ మనుష్యులు తినే తిండి తినడు. జయశంకర్ తయారు చేసిన ద్రవాలని మాత్రం తాగుతాడు. అందువలనే అతని శరీరం దృడంగా వుంటుంది.

భీమ నిద్ర నుండి లేవగానే ఆకలిగా వుండడంతో లాబ్ అంతా వెదికాడు. కానీ అతనికి కావలసిన ద్రవం దొరకలేదు. అందు వలన జయశంకర్ గదిలోకి వెళ్ళి వెదికాడు. ఒక అరలో పెద్ద తేనె సీసా కనిపించింది. భీమ ఆలోచించకుండా ఆ సీసా తీసుకుని మొత్తం తేనె తాగేసాడు. ఆ రుచి అతనికి బాగా నచ్చింది. కానీ తేనె అతని శరీరంలోకి ప్రవేశించగానే అతని శరీరంలో మార్పులు రాసాగింది. అతని శక్తి తగ్గిపోసాగింది. భీమకి అర్ధం కాక వేగంగా లాబ్‌లోకి వెళ్ళి పడు కున్నాడు. కొన్ని క్షణాల కంతా భీమ సన్నగా బక్కచిక్కి పోయాడు.

కొంతసేపటికి జయశంకర్ బయట నుండి తిన్నగా లాబ్‌లోకి వచ్చి భీమని చూసి ఆశ్చర్య పోయి ఏం జరిగిందని అడగడంతో భీమ అంతా చెప్పాడు. అపుడు జయశంకర్ ఆలో చించాడు. తాను ఎంత శక్తి వంతమైన మందుని కనిపెట్టినా దానికి విరుగుడు ఒకటి వుంటుందని గ్రహించి, తాను సేకరించిన పుస్తకాలు అంతా తిరగేసాడు.

అపుడు కొన్ని సంగతులు తెలిసాయి. తాను కనిపెట్టిన మందుకు తేనె విరుగడని. తేనె శరీరంలోకి వెళ్ళిన వెంటనే విజృభించి, తన మందుతో తయారైనా కణాలను నాశనం చేస్తుంది. అందువలన ఆ వ్యక్తి శక్తి హీనుడై ఎందుకు పనికి రాకుండా పోతాడు.

ఇంకొక విరుగుడు కరెంట్ షాక్. భీమలాంటి వ్యక్తి కరెంట్ షాక్ తగిలితే క్షణంలో అతని శరీరంలో రక్తం వేగంగా బయటికి వచ్చి ప్రాణాలు పోతాయి.

జయశంకర్ ఇది చదివి, ఇక ముందు భీమని ఈ రెండింటి వద్దకు వెళ్ళనీయకూడదని గ్రహించి, తిరిగి తన మందును భీమ శరీరం లోకి ఎక్కించాడు.

అలా వారం రోజులు ముందు భీమ శరీరంలోకి వెళ్ళిన తరువాత అతను మును పటిలా బలవంతుడుగా మారడంతో జయ శంకర్ సంతోషించాడు.

జయశంకర్‌కి ఆశపెరిగింది. భీమ శక్తి వుండేంతలో బాగా డబ్బు సంపాదించాలని



ప్రతి రోజు ఏదో బ్యాంకికి పంపి డబ్బులు దోచుకోసాగాడు. దాంతో పోలీసులు అప్రమత్తమై దొంగని వెదకనారంభించారు. ఒక వింత వ్యక్తి తన కళ్ళ ఆకర్షణతో, ఆయుధం ప్రయోగించకుండా లక్షల కొలది డబ్బులు దోచుకుపోతుంటే పోలీసులకు కోపం పెరిగి, అంతటా తీవ్రంగా గాలించసాగారు. బ్యాంక్ అదికారులు భీమ గురించి చెప్పిన ఆనవాళ్ళతో అతని ముఖం చిత్రించి అన్ని పోలీస్ స్టేషన్స్‌కు పంపారు.

ఆ సమయంలో హర్షవర్దన్ అనే డాక్టర్ పోలీసుల వద్దకి వచ్చి, పదేళ్ళ ముందు తనతో పని చేసిన జయశంకర్ అనే డాక్టర్ ఇటువంటి వింత వ్యక్తిని తయారు చేయాలని అందులకు కావలసిన విషయాలు సేకరించడం తాను గమనించానని, కానీ ఆ తరువాత జయశంకర్‌ని బయటికి తరమడంతో అతను ఎక్కడికి వెళ్ళిపోయాడని. ఇపుడు జరిగేది గమనిస్తుంటే, అంతా జయశంకర్ పని అయి వుంటుందని అనుమానంగా వుందని తన వద్ద వున్న జయశంకర్ ఫోటో ఇచ్చాడు.

అంతే కాకుండ జయశంకర్ ఇంటి సమీపంలో వున్న వారందరికీ, జయశంకర్ ఇంటిలో తాము చూసిన వ్యక్తికి, పోలీసులు చిత్రీకరించిన దొంగ చిత్రం ఒకేలా వుందన్న అనుమానం కలిగి పోలీసులకి చెప్పారు.

వెంటనే ఇన్స్‌పెక్టర్ నలుగురు పోలీసులతో జయశంకర్ ఇంటికి వచ్చారు. ముందు జయశంకర్ కొంత భయపడిన తమాయించుకుని ఎందుకు వచ్చారని అడిగాడు.

ఇన్స్‌పెక్టర్ ఏమీ మాట్లాడకుండా పోలీసులని ఇల్లంతా సోదా చేయమని చెప్పాడు. జయశంకర్ కోపంతో వారిని అడ్డుకోడానికి





ప్రయత్నించాడు. వీలుకాలేదు. పోలీసులు అంతా వెదికి గదులలో దాచిన లక్షలు తీసుకు వచ్చారు.

ఇన్స్‌పెక్టర్ కోపంతో, "జయశంకర్! ఇంత డబ్బు నీకెక్కడిది? మాకు అంతా తెలుసు. ఈ మధ్య జరుగుతున్న బ్యాంక్ దొంగతనాలకి నువ్వే కారణమని? ఎక్కడ ఇంకో వ్యక్తి" అన్నాడు.

సరిగ్గా ఆ సమయానికి భీమ ఏదో బ్యాంక్ నుండి దోచుకున్న డబ్బుతో ఇంట్లోకి వస్తూ పోలీసులని చూసి ఆగిపోయాడు. ఇన్స్‌పెక్టర్ భీమ చేతిలోని బాగ్ లాగి అందులో నోట్లు కట్టలు చూసి, పోలీసులతో ఇద్దరి దొంగలని అరెస్ట్ చేయండి" అన్నాడు.

అంతలో జయశంకర్, "భీమా! నీ కూలింగ్ గ్లాస్ తీసి వాళ్ళకోపాన్ని తగ్గించు" అనడంతో, భీమ తన కూలింగ్ గ్లాస్ తీసి, "మీరు నా కళ్ళు చూసి మాట్లాడండి. మీకు అన్నీ వివరంగా చెబుతాను" అన్నాడు.

కాని ఇన్స్‌పెక్టర్ పోలీసులు భీమ కళ్ళ శక్తి గురించి ముందుగా తెలిసివున్నందువలన వాళ్ళు తమ కూలింగ్ గ్లాసులు వేసుకుని, "భీమా! నీ ఆటలు ఇక సాగవు. మర్యాదగా లొంగిపో" అన్నాడు.

పోలీసులు జాగ్రత్త పడడంతో భీమ వాళ్ళకి దొరకకూడదని బలంగా వాళ్ళని క్రిందికితోసి బయటకి పరిగెత్తాడు. పోలీసులు వాడి వెనుక పరిగెత్తారు. కానీ భీమ అతి వేగంగా పరిగెత్తడం కాదు. ఇళ్ళ మీద పాకుకుంటూ దూకుకుంటూ వెళుతూ, పోలీసులకి దొరకక తప్పించుకున్నాడు.



దాంతో పోలీసులు జయశంకర్‌ని అరెస్ట్ చేసి పోలీస్ స్టేషన్‌కి తీసుకు వెళ్ళారు. భీమ గురించి ఎంత అడిగిన జయశంకర్ చెప్పలేదు. తప్పించుకున్న భీమ ఎలాగైనా తనని కాపాడుతాడని నమ్మకంతో జయశంకర్ పోలీసులచే చావు దెబ్బలు తిన్నాడు.

రాత్రి వరకు తప్పించుకుని తిరుగుతున్న భీమకి ఆకలనిపించింది.

ముందే అతనితో ఏదీ తినకూడదని చెప్పిందువలన భీమ తిన్నగా జయశంకర్ లాబ్‌లోకి వెళ్ళి, అక్కడ అతని కొరకు జయశంకర్ వుంచిన ద్రవాన్ని తాగి అలాగే పడుకున్నాడు.

తప్పించుకున్న భీమ ఎప్పటికైన జయశంకర్ ఇంటికి వస్తాడన్న అనుమానంతో పోలీసులు ఇంటి చుట్టూ దాగి వున్నారు. భీమ లోపలికి వెళ్ళడంతో ఇన్స్‌పెక్టర్‌కి ఫోన్ చేయించి, అయన్ని అక్కడికి రప్పించారు. ఆ తరువాత అందరూ ఇంట్లోకి ప్రవేశించి, లాబ్‌లో నిద్రపోతున్న భీమ చేతులకి బేడీలు వేసి, అతన్ని మోసుకుని పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి లాకప్‌లో బందించారు.

అంత త్వరగా భీమ దొరకడంతో అందరూ సంతోషించారు.

కాని తెల్లవారడంతో భీమకి మెలకువ అయి చేతులకు బేడీలుండడంతో కోపంతో దాన్ని తెంచి, జైలు కమ్ములను విరిచి బయటికి వచ్చాడు. అడ్డు వచ్చిన పోలీసులని చితకబాది, పోలీస్ స్టేషన్‌ని ధ్వంసం చేసి తిరిగి పారిపోయాడు. ఆ తరువాత వచ్చిన ఇన్స్‌పెక్టర్ భీమ చాలా శక్తివంతుడని, వాడిని బందించడానికి కొత్త పథకాలు ఆలోచించాడు.





రాత్రి వరకు ఎక్కడో దాగుతున్న భీమ ఆకలి కావడంతో తిన్నగా జయశంకర్ ఇంటికి వచ్చాడు. అక్కడ ముందుగా దాగి వున్న పోలీసులు ఒక్కసారిగా భీమమీదికి ఎగబడ్డారు. ఆకలితో వున్న భీమ కోపంతో పోలీసులని చీల్చి చెండాడాడు. ఒక్క క్షణంలో వరి మంది ఒక్కో మూలన రక్తగాయాలతో పడ్డారు.

సరిగ్గా ఆ సమయానికి జయశంకర్ పోలీసుల వద్ద నుండి తప్పించుకుని అక్కడికి వచ్చి, "భీమా! ఇక మనం ఇక్కడ వుండటం మంచిది కాదు. వెంటనే ఈ ఊరు వదిలి వెళ్ళిపోవాలి. ముందు నువ్వు ఆ మందు తాగిరా నేను కారులో తయారుగా వుంటాను" అన్నాడు.

భీమ లోపలికి వెళ్ళి మందు తాగి, మిగిలిన మందు సీసాలు తీసుకుని బయట కారులో ఎక్కాడు. జయశంకర్ ముందుకు నడిపాడు.

[illegible]



వెళ్ళారు. లోపలున్న బీరువాలు విరగ గొట్టి, తలుపులు తెరచి, వెయ్యి రూపాయల కట్టలు మాత్రం అక్కడ వున్న తోలు సంచి నిండుగా నింపారు.

"భీమా! ఇక చాలు. ఆలశ్యమైతే అపాయం త్వరగా బయటికి వెళ్ళిపోదాం" అన్నాడే జయశంకర్.

"బాస్! ఆ చివరి బీరువా తెరవలేదు. అందులో ఏముందో చూద్దాం" అంటూ భీమ ఆ బీరువా వద్దకు నడిచాడు.

సరిగ్గా ఆ సమయంలో దెబ్బలతో క్రింద పడిన సెక్యూరిటీ గార్డు నెమ్మదిగా పైకి లేచి,దగ్గరలో వున్న అలారం బటన్ నొక్కాడు. మరుక్షణం బ్యాంక్ మొత్తం పెద్దగా అలారం మోగసాగింది. దాంతో పాటు అన్ని ఇనుప తలుపులు బీరువాలపై విద్యుత్ ప్రవేశించింది. ఆ బ్యాంక్ వాళ్ళు అలా ఏర్పాటు చేసి వున్నారు. దొంగల నుండి తమ బ్యాంక్‌ని కాపాడు కోడానికి వాళ్ళు ఆ ఏర్పాటు చేసారు.

అలారం శబ్దం విని జయశంకర్ భయంతో "భీమా రా" అంటూ వెనక్కి తిరిగి పరిగెత్తి లాకర్ తలుపుని తాకాడు. విద్యుత్ షాక్ తగిలి అక్కడికక్కడే మరణించాడు.

భీమ బీరువా తెరవాలని దాని హాండిల్ మీద చేయి పెట్టాడు. అతడికి షాక్ తగిలింది. అంతే అంత శక్తి గల భీమ క్షణంలో మాడి మసి అయిపోయాడు.

దుష్ట శక్తి తయారు చేసిన వ్యక్తి, దుష్ట శక్తి ఒకేసారిగా చనిపోయారు. దుష్ట బుద్ధి గల జయశంకర్, దేశాన్నంతా దోచుకోవాలని ప్రయత్నించి ఆఖరికి ప్రాణాలు వదిలాడు.





# జ్వాలా ద్వీపంలో జాబిల్లి

డి.కె. [illegible]



## జరిగిన కథ:

విశాలపురంలో సైనికులు బింబాసురుడిని బందించి ఆ తరువాత వసంతపుర రాజు చంద్రకేతుని బందించి కీర్తిసేనుడి ముందు తీసుకు వెళ్ళారు. కీర్తిసేనుడు విచారించి, చంద్రకేతుని వదిలేసి, బింబాసురుడిని చెఱశాలలో బందించాడు. ఆ తరువాత బింబాసురుడు యువరాణికి నయం కావాలంటే జ్వాలా ద్వీపంలో వున్న జాబిల్లి అనే కుందేలుని తీసుకు రావాలని చెప్పడంతో ఆదిత్య, జయసింహ బయలుదేరారు. దారిలో గజదొంగ గంగులు అనుచరులతో వచ్చి మత్తు మందుతో తెలివి తప్పించి ఇద్దరిని బందించి తన స్థావరానికి తీసుకు వెళ్ళాడు

# 12

గంగులు తన స్థావరానికి ఆదిత్య, జయసింహులను తీసుకు వెళ్ళి వాళ్ళను రెండు స్తంబాలకి కట్టించాడు. ఆ ఇద్దరూ ఇంకా మత్తులోనే వున్నారు. ఆ తరువాత గంగులు తన అనుచరులతో, "వీళ్ళు సాదారణంగా చావకూడదు. మనల్ని చాలా ఇబ్బంది పెట్టిన ఇద్దరూ నరకాన్ని చూడాలి. అందులకు వీళ్ళని ఇక్కడ చంపకూడదు. వీళ్ళని ఇక్కడ నుండి దూరంగా తీసుకు వెళ్ళి చంపాలి. అందువలన వెంటనే మనం ఈ రాజ్యం వదిలి వెళ్ళిపోవాలి" అన్నాడు.

అంతలో ఒకడు "ఇద్దరూ వీరులు అంటున్నారు. వీళ్లని దూరదేశాలలకు మనం ఎలా తీసుకు పోవడం. దారిలో ఎవరైనా చూస్తే మనకి అపాయం కదా" అన్నాడు.

"అవును. అందుకే మీలో కొందరు నగరంలోకి వెళ్ళి ఓ గుఱ్ఱపు బండిని దొంగలించుకు రండి. ఆ బండిలో వీళ్ళని పడుకోబట్టి మనం సులభంగా వెళ్ళిపోవచ్చు" అనడంతో కొందరు బయలుదేరారు. ఆ తరువాత గంగులు తమకి రెండు మూడు రోజులకి కావలసిన వస్తువులను తీసుకురమ్మని కొంత మందిని పంపాడు. చెఱశాల నుండి తప్పించుకున్న పది మంది దొంగలు నగరంలోకి వెళ్ళారు. గంగులు మరో నలుగురు దొంగలు మాత్రం అక్కడ వున్నారు.

సేనాధిపతి కీర్తిసేనుడు చెఱశాల నుండి గంగులు అనుచరులు తప్పించుకున్న



ఆలస్యంగా తెలుసుకుని వారిని ఎలాగైనా బందించాలని సైనికులను తన వెంట తీసుకుని అడవి అంతా గాలించసాగాడు. [illegible] దొంగలను వెదకి సైనికులు అలసిపోయారు. పైగా అంతా చీకటిగా వున్నందువలన అందరూ అలాగే కూర్చుండిపోయారు. కానీ కీర్తిసేనుడు నిద్రపోకుండా అటూ ఇటూ చూడసాగాడు.

సరిగ్గా ఆ సమయానికి గంగులు అనుచరులు తమ స్థావరం నుండి బయటికి వచ్చారు. ఆ రాత్రి సమయంలో తమని బందించడానికి ఎవరూ వుండరని మాట్లాడుకుంటూ నడవసాగారు. వారికి అతి సమీపంలో వున్న కీర్తిసేనుడికి చిన్నగా మాటలు వినిపించడంతో చెవులు రిక్కరించి విని, ఎవరో వస్తున్నారనుకుని తన సైనికులను అప్రమత్తం చేసారు.

సైనికులు సవ్వడి చేయకుండా మెల్లగా వెళ్ళి ఆ దొంగల మీదికి దుమికారు. దొంగల కన్నా సైనికుల సంఖ్య ఎక్కువ వున్నందువలన సులభంగా దొంగలను బందించారు.

కీర్తిసేనుడు వారి ముందుకు వచ్చి, "ఎక్కడ మీ స్థావరం వుంది. మీ నాయకుడు ఎక్కడ మర్యాదగా చెప్పండి" అని బెదిరించాడు.

"మా ప్రాణం పోయినా మీ ప్రశ్నలకు సమాధానం చెప్పము" అని వాళ్ళు అనడంతో కీర్తిసేనుడు కోపంతో, "వీళ్ళని మన [illegible] చెరలో వుంచండి. వీరి సంగతి నేను తరువాత [illegible]" అంటూ ముందుకు నడవడంతో



[illegible]



పరిగెత్తుకు వచ్చి "గంగులూ! మన వాళ్ళనంతా కీర్తిసేనుడు బందించాడు. నేను మాత్రం తప్పించుకుని వచ్చేసాను. కానీ ఇక్కడికి కొంత దూరంలో గంగరాజు అనుచరులతో ఇటు వైపు రావడం గమనించాను. మనం త్వరగా ఇక్కడ నుండి వెళ్ళిపోవాలి" అన్నాడు.

గంగులు కోపంతో, "చాలా రోజుల తరువాత మన వాళ్ళు తప్పించుకున్నారని అనుకుంటుండగా అంతలో సైనికులు బందించారా" మరి ఈ సమయంలో గంగరాజు ఎందుకు వస్తున్నాడు. వాడిని ఎదిరించడానికి మన వల్లకాదు. సరే. ముందు ఆయుధాలు బయటికి తీయండి" అని అంటుండగా లోపలికి గంగరాజు అతని అనుచరులు కత్తులతో అరుస్తూ వచ్చారు.

గంగులు అతని అనుచరులు వాళ్ళని ఎదిరించారు. కాని గంగరాజు అనుచరులు ఎక్కువ మంది వుండడం వలన, గంగులు అనుచరులను చంపేసారు. గంగరాజు కత్తి గంగులు మెడ మీద పెట్టి, "గంగులూ! ఎన్నిసార్లు మా వాళ్లని చంపావు. నేను ఎప్పుడైనా దొంగతనానికి విశాలపురానికి వచ్చానా. కాని నువ్వు ఇక్కడ దొంగతనాలు చేస్తున్నావు. మా నగరానికి వచ్చి దొంగతనం చేస్తున్నావు. అడ్డు వచ్చిన నా తమ్ముడిని, అనుచరులను చంపి తప్పించుకున్నావు. నిన్ను వదులుతానా. నిన్ను నీ స్థావరంలోనే చంపాలని ఇన్ని రోజులు ఎదురుచూసాను. మంచి సమయానికి వచ్చాను" అన్నాడు.



"గంగరాజు! నన్ను వదిలేయి. ఇకపై నీ జోలికి రాను. ఈ నగరం వదిలి వెళ్ళిపోతాను" అని గంగులు అంటుండగా గంగరాజు అతని మాటలు వినకుండా తల నరికేసాడు. అంతటిని చూస్తున్న ఆదిత్య జయ సింహులకి ఏమీ అర్థం కాలేదు. అంతలో గంగరాజు వారి వద్దకి వచ్చి "ఎవరు మీరు? మిమ్మల్ని గంగులు ఎందుకు బందించాడు" అని అడగడంతో ఇద్దరూ తమ గురించి చెప్పారు.

"అయితే మీరు రాజుగారికి సంబంధించిన వారన్నమాట. మిమ్మల్ని నమ్మకూడదు. మీ వలన నాకు అపాయం వుంటుంది. మిమ్మల్ని చంపేయాలి" అని గంగరాజు కత్తిని పైకి ఎత్తాడు.

అంతలో అతని అనుచరుడు, "ఎందుకు అనవసరంగా చంపుతారు. గంగులు, అతని అనుచరులు శత్రువులు అందువలన చంపారు. వీళ్ళని చంపడం కన్నా కపాల దీవివారికి బానిసగా అమ్మితే మనకి బంగారు నాణాలు వస్తుంది" అన్నాడు.

గంగరాజు నవ్వుతూ, "నీ ఆలోచన బాగుంది. వీళ్లని బాగా కట్టి బయట వున్న మన గుర్రబండీలో వుంచండి. ఇపుడు బయలు దేరితే సముద్ర తీరాన్ని త్వరగా చేరుకోవచ్చు. అక్కడ కపాల దీవికి ఓడ బయలుదేరడానికి సిద్దంగా వుంటుంది రండి" అంటూ ముందుకు నడిచాడు. అతని అనుచరులు ఆదిత్య, జయ సింహులని బండిలో ఎక్కించి ముందుకు నడిపారు.





తెల్లవారి సమయానికి అందరూ సముద్ర తీరం చేరుకున్నారు. గంగరాజు ఓడలో ఒక వ్యక్తిని కలసి ఏదో మాట్లాడి, బంగారు నాణాలు తీసుకుని, వాళ్ళకి ఆదిత్య, జయసింహులని అప్పగించి వెళ్ళిపోయాడు.

ఆదిత్య, జయసింహులకి ఏమీ అర్థం కాలేదు. కాని తప్పించుకు పోవడానికి వీలులేక చేతులు కట్టి వున్నందువలన ఏమీ చేయలేక పోయారు.

ఆ వ్యక్తి, ఇద్దరిని ఓడలో వున్న పెద్ద గదిలోకి తోసి తలుపులు మూసాడు. లోపల పది మంది దాక బందీలుగా వున్నారు. ఆదిత్య ఒక వ్యక్తి వద్దకు వెళ్ళి "తమని ఎక్కడికి తీసుకు పోతున్నారో" అని అడిగాడు.

ఆ వ్యక్తి హీనస్వరంతో, "మనం అంతా కపాల దీవికి వెళుతున్నాం. కపాల దీవి అగ్గిదొరది. వాడు పరమ కిరాతకుడు. ఆ దీవిలో అతను, అతని కుటుంబంవారు మాత్రం వుంటున్నారు. ఎవరినీ ఆ దీవిలో అడుగు పెట్టనీయడు. ఈ మధ్య సముద్ర దొంగలు వచ్చి అగ్గిదొర వద్ద వున్న బంగారు నాణాలు, వజ్రాలు, రత్నాలు దొంగలించుకుపోతున్నారు. వాళ్ళని ఎగిరించడానికి, ఆయనకి కాపలాగా వుండడానికి చుట్టూ ప్రక్కల రాజ్యాలవారిని అడిగాడు. దొంగలపై భయంతో ఎవరూ రాలేదు. అందువలన మనలాంటి అమాయకులను మోసగించి బానిసలుగా కొని, ఆ దీవిని రక్షించడానికి తీసుకుపోతున్నాడు. ఒకవేళ దొంగల దాడిలో మనం చనిపోయినా వాడికి నష్టం లేదు. అందువలన మనల్ని తీసుకు పోతున్నాడు" అన్నాడు.

అంతా అర్థం చేసుకున్న ఆదిత్య జయసింహ ఓడలో నుండి ఎలాగైనా తప్పించుకోవాలని మనసులో అనుకున్నారు.

ఓడ సగం దూరం వెళ్ళిన తరువాత బానిసలకున్న చేతికట్లు విప్పేసారు. గది తలుపులు తెరచి వుంచారు. అది ఆ ఇద్దరికి సంతోషమైంది. మరునాడు ఉదయం ఓడ కపాల దీవిని చేరుతుందని చెప్పడంతో ఆదిత్య, "జయసింహా! రాత్రి మనం, వీరిచ్చిన తిండి తిని నిద్ర పోకుండా, వుండి, అందరూ నిద్రపోయిన తరువాత ఈ గది నుండి బయటికి వచ్చి, ఓడలో నుండి సముద్రంలోకి దూకి ఈదుకుని వెళ్ళిపోదాం. ఈ సంగతి మిగతా వారితో చెప్పకు" అని మెల్లగా చెప్పాడు.

అనుకున్నట్లు అంతా జరిగింది. బానిసలందరూ నిద్రపోయారు. జయసింప, ఆదిత్య నిద్రపోకుండా, మేలుకుని వున్నారు. కాని వారి వల్ల కాలేదు.

నిద్ర ముంచుకు వస్తుంది. అతి కష్టంతో నిద్ర ఆపుకుని, అర్థ రాత్రి అయిన తరువాత లేచి, గది నుండి బయటికి వచ్చారు. కాపలావాళ్ళు నిద్ర పోతున్నారు. నెమ్మదిగా ఓడమీదికి వెళ్ళి, సముద్రం వైపు తొంగి చూసారు.

"ఆదిత్యా! నాకు నిద్ర ముంచుకు వస్తుంది. ఈ నిద్ర మత్తులో సముద్రంలో దూకితే మనకి చాలా కష్టం" అన్నాడు జయసింహ.



"అవును. నా పరిస్థితి అంతే, అతి కష్టపడి నిద్ర మేలుకుని వున్నాను. మనం ఇపుడు ప్రయత్నించకపోతే, ఆ దీవిలో చిక్కుకుపోతాం. అపుడు ఇంకా కష్టం" అంటూ ఆదిత్య రెండ డుగులు వేసాడు. అడుగులు తడబడసాగింది. కళ్ళు మూతలు పడసాగింది.

అంతే! ఒక్కసారిగా ఇద్దరూ ఓడలోనే పడిపోయారు. ఆ సంగతి వారికే తెలియలేదు.

తెల్లవారింది. ముఖాలపై ఎండ పడ డంతో, ఇద్దరూ వులిక్కిపడి లేచారు. వారి చుట్టూ కాపలా వాళ్ళు కత్తులతో నిలబడి వున్నారు. ఇద్దరూ రాత్రి జరిగింది మెలమెల్లగా గుర్తుకు తెచ్చుకోసాగారు. తాము తప్పించు కోవాలని ఇక్కడి వరకు వచ్చినంతవరకు గుర్తు వచ్చింది. ఆ తరువాత తాము సముద్రంలో దుమికి తప్పించుకుపోకుండా, ఓడలో ఎందుకు నిద్రపోతున్నామో అర్థం కాలేదు.

వారి పరిస్థితి గమనించి ఒకడు, "మా వద్ద వున్న బానిసలల్లోనే మీరిద్దరూ కొంత వ్యత్యాసంగా కనిపించారు. రాత్రి సమయంలో ఇలాంటి ప్రయత్నాలు చేస్తారని ముందు జాగ్రత్తతో మీరు తిన్న తిండిలో నిన్న రాత్రి మత్తు మందు కలిపాము. మేము అనుకున్నట్లే జరిగింది. మిమ్మల్ని బంగారు నాణాలు ఇచ్చి కొనింది మా దీవిలో పని చేయడానికి, మీరు మమ్మల్ని మోసగించడానికి ప్రయత్నిస్తారా" అంటూ ఇద్దరికి ఇనుప సంకెళ్ళు వేయించాడు.

కొంతసేపటికి ఓడ కపాల దీవిని చేరింది. ఓడలోని కాపలావాళ్ళు, బానిసలని నెమ్మదిగా దీవిలోకి దింపసాగారు.

బానిసలలో ఇద్దర్ని మాత్రం సంకెళ్ళతో బంధించి తీసుకు రావడం అగ్గిరాజు ఆశ్చర్యంగా చూడసాగాడు.

**(ఇంకా వుంది)**







# వింత ప్రవర్తన

శ్రద్ధానందుడనే గురువు వద్దకు రామయ్య అనే వ్యక్తి కొడుకైన గోవిందాన్ని శిష్యునిగా స్వీకరించమని కోరుటకై వచ్చాడు. శ్రద్ధానందుడికి అనేక మంది శిష్యులున్నారు. ఆ ఆశ్రమ పరిసరాలు పచ్చని చెట్లతో గ్రామ పొలిమేరల్లో కళకళలాడుతూ వున్నాయి.

ఇంతలో అటుగా వెళుతున్న ఒక వృద్ధురాలు ఆ బాటపై గల అరటితొక్కపై కాలు వేసి చర్రున జారి క్రిందపడిపోయింది. వెంటనే శ్రద్ధానందుడి ఒక శిష్యుడు పరిగెత్తుకుని వెళ్ళి ఆమెకు చేయి అందించి పైకి లేపాడు. వెంటనే ఆమె కాలుతో కుంటుచూ గ్రామానికి వెళ్ళి పోయింది.

వెంటనే శ్రద్ధానందుడు ఆ శిష్యుని పిలిచి లెంప కాయ కొట్టాడు. ఆ శిష్యుడు మారుమాట్లాడకుండా తలవంచుకున్నాడు. ఇదంతా క్రొత్తగా వచ్చిన ఆ తండ్రి కొడుకులు గమనిస్తున్నారు.

ఇంతలో మరొక ముసలివాడు ఆ ఆశ్రమానికి వస్తున్నాడు. అతడు దగ్గరకు రాగానే మరొక శిష్యుడు పరిగెత్తుకొని వెళ్ళి ఆ ముసలివాడిని ఒక్క తోపు తోశాడు. ఆ ముసలివాడు బోర్లా బొక్కా తూలి క్రిందపడిపోయాడు. అతనికి దెబ్బలేమి తగల్లేదు. ఆ శిష్యుని దూషించు కుంటూ అతడు లేచి, తిరిగి గ్రామానికి వెళ్ళాడు.

శ్రద్ధానందుడు ఆ శిష్యుని పిలిచి భుజం తట్టి "శభాష్" అని అభినందించాడు. గురువు ప్రవర్తన ఆ తండ్రి కొడుకులకు చాలా వింతగా అనిపించింది. ఆ తండ్రి పేరు రామయ్య, కొడుకు పేరు గోవిందం.

ఇక ఉండబట్టలేని గోవిందం "అయ్యా! మీ ప్రవర్తన చాలా వింతగా ఉంది. వృద్ధురాలుకు చేయూత నందించిన ఆ శిష్యుని లెంపకాయ కొట్టారు. మరో వృద్ధుని పడదోసిన ఆ శిష్యుని అభినందించారు. ఇది

**సంగనబట్ల రామకిష్టయ్య, ధర్మపురి.**

నాకు అర్థం కాలేదు. మీలాంటి వారి దగ్గర నేను ఎలాగూ విద్యను నేర్చుకోలేను. కనుక నా సందేహాన్ని తీర్చండి" అన్నాడు.

అపుడు శ్రద్ధానందుడు "ఒరేయ్! నీ సందేహం తీర్చుతాను విను. నా మొదటి శిష్యుని దగ్గర ఓర్పు ఉంది. రెండవ శిష్యుని దగ్గర నేర్పు ఉంది" అని అన్నాడు. "అయ్యా! ఆ ఓర్పు ఏమిటి? నేర్పు ఏమిటి? నాకేం అర్థం కాలేదు. కాస్త విడమరచి చెప్పండి" అని అన్నాడు గోవిందం. అపుడు గురువు "మొదటి శిష్యుడు ఆ వృద్ధురాలిని చేతితో పైకి లేపాడు. నిజమే. కాని అతడు బలిష్ఠమైన యువకుడు. ఆమెను ఎత్తుకుని ఆశ్రమానికి తీసుకుని వచ్చి సపర్యలు చేయకుండా కేవలం ఆమెను పైకి లేపి పంపించాడు. అందువలన అతనిని లెంపకాయ కొట్టాను. అయినా అతడు కిమ్మన లేదు. అందుకే అతని ఓర్పును మెచ్చుకున్నాడు.

ఇక రెండవ శిష్యుని ఆ వృద్ధుని పడదోసినందుకు ఊరకే అభినందించలేదు. ఆ వృద్ధుడు గుడ్డివాడు. అతని దగ్గరకు ఒక విష సర్పం వస్తున్నది. అది గమనించిన మా శిష్యుడు అది కాటేయకుండా ఒక్కతోపు అతనికి ప్రక్కకు తోసి, ఆ పాము నుండి అతని ప్రాణాలు కాపాడాడు. అందుకే అతని నేర్పును అభినందించాను. ఇపుడు అర్థమైందా! నేను ఎందుకు అలా ప్రవర్తించానో" అని అన్నాడు గురువు.

ఆ సమాధానం విన్న గోవిందం సిగ్గుతో తల వంచుకుని "అయ్యా! మరి నాకు ఆ ఓర్పు, నేర్పు రెండు లేవు. నాకు ఎలా విద్యను నేర్పుతారు?" అని ప్రశ్నించాడు. శ్రద్ధానందుడు మాట్లాడుతూ "నీలో ప్రశ్నించే తత్వం ఉంది. తెలుసుకోవాలన్న ఆసక్తి ఉంది. అది నాకు చాలా నచ్చింది. ఏ శిష్యునికైనా ఉండవలసింది అదే. ఇక ఓర్పు, నేర్పు క్రమంగా వస్తుంది" అని చెప్పి అతనిని తన శిష్యునిగా చేర్చుకున్నాడు.

తన కుమారుని జిజ్ఞాసకు, ఆ గురువు వివరణకు సంతోషించిన రామయ్య తన కుమారుని శిష్యునిగా అంగీకరించినందుకు ఆ గురువుకు కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోయాడు.







# ఫ్రెండ్స్

ఆ రోజు ఎనిమిదో తరగతి నెల పరీక్ష మార్కులు మాష్టారు చెబుతారని పిల్లలు క్లాస్‌రూమ్‌లో కూర్చుని మాష్టారు కొరకు ఎదురుచూస్తున్నారు.

పిల్లలలో రవి అందరికన్నా ఎక్కువ మార్కులు వస్తాయని కలలు కంటున్నాడు. రవి తండ్రి పెద్ద పారిశ్రామిక వేత్త. పెద్ద బంగళా, కారు, పనులు చేయడానికి నౌకర్లు వున్నారు. రవి బాగానే చదివే కుర్రవాడు.

కృష్ణ అదే తరగతిలో చదువుతున్నాడు. వాడు తెలివైన పిల్లవాడు. చాలా బీదవాడు. తండ్రిలేడు. తల్లి అందరి ఇండ్లలో పనులు చేస్తూ కొడుకుని చదివిస్తుంది. కృష్ణ బాగా చదివేవలన బడిలో అతనికి ఫీజులు తీసుకోలేదు. పుస్తకాలు ఉచితంగా ఇచ్చారు.

మాష్టారు పరీక్ష ఫలితాలు చెప్పారు. అన్నింటిలో కృష్ణనే ఎక్కువ మార్కులు సంపాదించాడు. రవి వెనుక బడ్డాడు. అది చూసి రవికి కోపం వచ్చింది. తాను ఎంతో కష్టపడి చదివి పరీక్షలు వ్రాస్తే మాష్టారు సరిగ్గా గమనించకుండా. కృష్ణకి మార్కులు ఎక్కువ వేసారని. కృష్ణపై ద్వేషం పెంచుకున్నాడు. కృష్ణని ఆ బడి నుండి తరిమేయాలని అనుకున్నాడు. తనకి కారు. బంగళా, డబ్బులు వున్నాయి. కానీ కృష్ణకి ఏమీ లేదు. అయినా వాడినే అందరూ పొగడుతుంటారు. అది రవికి నచ్చదు.

ఆ బడిలో రాఘవేంద్ర మాష్టారు రిటైర్డ్ అవుతున్నారు. ఆయన చాలా మంచి వ్యక్తి పిల్లలకు చక్కగా పాఠాలు నేర్పిస్తారు. ఆయనంటే అందరికీ గౌరవం. అందువలన ఆయనకి సన్మాన సభ

ఎ. దేవయాని, ఖమ్మం



ఏర్పాటు చేయాలనుకున్నారు. ఆ సభలో ఆయనికి అందరూ మంచి బహుమతులు ఇవ్వాలనుకున్నారు.

మరునాడు రాఘవేంద్ర మాష్టారు గారికి సన్మాన సభ ప్రారంభమైంది.

స్టేజి మీదికి ఎక్కి రవి, తన చేతిలో వున్న పెన్‌ని అందరికి చూపి, "ఇది చాలా ఖరీదైనది. ఈ మాష్టారుపై అభిమానంతో బహుమతిగా ఇస్తున్నాను. నన్ను గుర్తుపెట్టుకుంటారన్న ఆశతో" అన్నాడు.

రాఘవేంద్ర మాష్టారు పెన్‌ని తీసుకుని, "రవి! చాలా సంతోషం. ఇది చాలా ఖరీదైనది అని తెలుస్తుంది. కానీ నాకు నా పెన్‌తో తప్ప వేరే పేనాలతో వ్రాయడం ఇష్టం లేదు. కానీ నాపై ప్రేమతో తెచ్చినందువలన తీసుకున్నాను" అన్నారు.

ఆ తరువాత కృష్ణ తోటి పిల్లలతో వచ్చి ఒక పేకట్ మాష్టారు గారికి అందించాడు.

రాఘవేంద్ర మాష్టారు దాన్ని విప్పి, లోపల వున్న భగవద్గీత పుస్తకాన్ని తీసి కళ్ళకు అద్దుకుని, "ఇది చాలా అద్భుతమైన బహుమతి. రిటైర్డ్ జీవితంలో ఇది బాగా పనికి వస్తుంది. ఈ రోజు నాకు చాలా బహుమతులు వచ్చాయి. అన్నీ ఖరీదైనవి అని నాకు తెలుసు. కాని ఈ చిన్న పిల్లలు భగవద్గీత పుస్తకాన్ని ఇచ్చి నా మనసును ఆకట్టుకున్నారు. ఎవరూ తప్పుగా అనుకోకుండా వుంటానంటే ఓ విషయం చెబుతాను. నాకు వచ్చిన బహుమతులలో ఇదే నాకు నచ్చింది అని మనస్ఫూర్తిగా చెబుతున్నాను. ఈ పిల్లలకు ఇంత మంచి ఆలోచన వచ్చినందుకు ఆనందంగా వుంది" అంటూ పిల్లలవైపు చూసి, "ఈ బహుమతి ఇవ్వాలని మీలో ఎవరు అనుకున్నారు" అడిగారు.

అందరూ కలసి కృష్ణ పేరు చెప్పారు. ఆయన కృష్ణని పిలిచి తెగ మెచ్చుకున్నారు. అంటిని చూస్తున్న రవి కోపంతో కుతకుతలాడాడు. తాను ఒక్కడు వెయ్యి రూపాయలు ఖర్చు పెట్టి పెన్ మాష్టారుకు ఇస్తే తనని మెచ్చుకోలేదు. అంత మంది పిల్లలు కలసి నాలుగైదు వందలతో ఓ పుస్తకం తీస్తే మాష్టారు అంతగా మెచ్చుకుంటున్నారు. అన్నింటిలో కృష్ణ తనకి అడ్డు తగులుతున్నాడు. వాడిని ఈ బడి నుండి తరమాలి" అని రవి అనుకున్నాడు.

రెండు రోజుల తర్వాత రవి సాయంత్రం ఆడుకునేందుకు గ్రౌండ్‌కు వెళ్ళాడు. వర్షం వచ్చి



ఆగిన వలన గ్రౌండ్‌లో మట్టి అంతా తడిగా వున్నందువలన పిల్లలు ఎవరూ లేరు. కానీ ఒక మూలలో కృష్ణ పుస్తకం చదువుతూ కనిపించాడు. అపుడు రవికి ఓ ఆలోచన వచ్చింది. అటూ, ఇటూ చూసాడు. పిడికిలి అంత రాయి కనిపించింది. దాన్ని తీసి గురిగా కృష్ణ తల మీదికి విసిరితే పెద్ద గాయమై, కొన్ని రోజుల వరకు బడికి రాకుండా వుంటాడు. అంతవరకు తాను సంతోషంగా వుండవచ్చునని రవి మనసులో అనుకుని, మెల్లగా చెట్టు వెనక్కి వెళ్ళాడు. మరోసారి అంతటా కలియచూసాడు. ఎవ్వరూ లేరు.

రవి రాయి వున్న చేయి వేగంగా పైకి ఎత్తాడు. అపుడు గడ్డిలో వున్న ఎఱ్ఱ తేలు రవి పాదాన్ని తన కొండెంతో కుట్టింది.

రవికి ఎలక్ట్రిక్ షాక్ తిన్నట్లనిపించి పెద్దగా కేక వేసి క్రింద పడిపోయాడు. దగ్గరలోనే వున్న కృష్ణ వెనక్కి తిరిగి చూసి గబ గబా రవి వద్దకు పరిగెత్తాడు. కృష్ణకి ఏమీ అర్థం కాలేదు. వెంటనే గ్రౌండ్ బయటకి వెళ్ళి, అటుగా వెళ్తున్న రిక్షాని ఆపి, రవిని ఎక్కించుకుని దగ్గరలో వున్న హాస్పిటల్‌కు వెళ్ళాడు.

కళ్ళు తెరిచిన రవి, ఎదురుగా తల్లి తండ్రులు. తాను హాస్పిటల్‌లో వున్నది గమనించి ఆశ్చర్య పోయాడు. అంతలో తల్లి జరిగింది చెప్పి, మంచి సమయానికి కృష్ణ హాస్పిటల్‌లో చేర్పించినది చెప్పింది.

రవి తల ఎత్తి చూసి, అక్కడ వున్న కృష్ణని చూసి కన్నీరు కారుస్తూ మనసులో "నేను వాడిని నాశనం చేయాలనుకున్నాను. కానీ వాడు నా ప్రాణం కాపాడాడు. ఈ రోజుతో నాలో వున్న అహంకారం ద్వేషం అంతా పోయి మంచి వాడిగా మారుతాను" అనుకుని పైకి, "కృష్ణా! ఈ రోజు నుండి మనం ఫ్రెండ్స్" అంటూ చేయి అందించాడు. కృష్ణ అతనితో చేయి కలిపాడు.



# అంజనాదేవి

రంభా, ఊర్వశి, తిలోత్తమ, మేనక, పుష్పగంధి, సుకేసి, మహాశ్వేత, ప్రమ్లోచ, మనోరమ, ప్రమధర, ఘృతాచి, గీతాజ్ఞ, చారుహాసిని, చంద్రప్రభ, సోమ, విద్యున్మాల, అంబుజాక్షి, కాంచనమాల, వంటి పదహారు వేల యాభై ఒక్క మంది అప్సరసలలో ఒక్కతైన 'పుంజికస్థల' శాపవశాన కుంజరుని కుమార్తెగా అంజనాదేవి పేరున జన్మించి ఈమె 'కేసరి' అనే వాశరవీరుని వివాహం చేసుకుంది. మహా బలవంతుడైన ఇతను కాంచన పర్వత నివాసి.

శంఖం, శబలం అనే ఏనుగులు ప్రభాస తీర్థంలోని ముని ఆశ్రమాలను ధ్వంసం చేస్తుండటంతో, మునులు కేసరితో మొరపెట్టుకోవడంతో ఆ ఏనుగులను సంహరించాడు. సంతసించిన మునులు కేసరిని ఏదైనా వరం కోరుకోమన్నారు. "కోరిన రూపం ధరించి, ఎన్ని యోజనాలైనా అలుపు లేకుండా ఆకాశమార్గాన ప్రయాణం చేయగలిగే చిరంజీవి అయిన పుత్రుని కోరుకున్నాడు' కేసరి. శ్రీ మహావిష్ణువు రాముని అవతారంలో మానవ రూపంలో అవతరిస్తాడని అతనికి నమ్మిన బంటుగా ఉండి లోక కళ్యాణానికి దుష్ట శిక్షణగా, రాక్షస సంహారం చేసే నీ పుత్రుడు శివుని ఆశీర్వాదంతో, వాయు దేవుముని అనుగ్రహిం వలన, నీ కోరిక తీరుతుంది" అన్నారు మునులు.

అతిలోక సౌందర్యవతి అయిన అంజనాదేవి, పర్వత విహరం చేస్తుండగా... వాయుదేవుడు "దేవి లోక కల్యాణం కొరకు కారణ జన్మురాలివైన నీకు నా వరాన మహోన్నత బలపరాక్రమశాలి, తేజో సంపన్నుడు, ధీమంతుడు, చిరంజీవి అయిన పుత్రుడు జన్మిస్తాడు" అని వెళ్ళిపోయాడు.

వాయుదేవుని వరాన అంజనాదేవికి పున్నమి చంద్రుని పోలిన బిడ్డ జన్మించాడు. అందగాడు అయిన ఆ బాలునికి 'సుందరుడు' అని అంజనా దేవి దంపతులు పేరు పెట్టారు, అంజనాదేవి తనయుడు కనక ఆంజనేయుడిగా పిలవబడుతూ పండుగా భావించి సూర్యుని మింగబోయి, ఇంద్రుని వజ్రాయుధంతో (హనువు) దవడు భాగాన గాయం కావడంతో హనుమంతునిగా పిలవబడ్డాడు.

బెల్లంకొండ నాగేశ్వరరావు,



# భాషా ప్రయుక్త మహాకవులు

| | భాష | | మహాకవుల పేర్లు |
|---|---|---|---|
| 1. | బెంగాలి | - | ఠాగూర్ |
| 2. | ఆంగ్లము | - | షేక్స్పియర్ |
| 3. | హిందీ | - | తులసీదాస్ |
| 4. | కన్నడము | - | పంపా |
| 5. | మలయాళము | - | ఇజహత్ చాన్ |
| 6. | మరాఠీ | - | జ్ఞానదేవ్ |
| 7. | ఒరియా | - | ఉపేంద్రభంజా |
| 8. | పంజాబి | - | బహవీర్‌సింగ్ |
| 9. | సంస్కృతము | - | కాళిదాసు |
| 10. | తమిళము | - | తిరువళ్ళువర్ |
| 11. | తెలుగు | - | శ్రీకృష్ణదేవరాయలు |
| 12. | ఉర్దు | - | గాలిబ్ |

బాలబాంధవ గంగరాజు మోహన రావు, చెన్నై



# నిజాయితీ

రామయ్య పెద్ద భూస్వామి. అతనికి యాభై ఎకరాల కొబ్బరితోట ఉంది. ఆ కొబ్బరి తోటలో అతనికొక నివాస గృహం వుంది. కుటుంబంతో పాటు అందులోనే ఉండడం రామయ్యకు ఇష్టం. ఆ కొబ్బరి తోటను కాపలా కాయడానికి అతనికి పదిమంది నౌకర్లున్నారు.

ఒకసారి రామయ్య వ్రేలికున్న ఉంగరం పోయింది. తన నౌకర్లను పిలిచి అడిగాడు. తామెవ్వరూ తీయలేదన్నారు వారు. కాని రామయ్యకు నమ్మశక్యం కాలేదు. ఇది ఖచ్చితంగా తన పదిమంది నౌకర్లలో ఎవరో ఒకరి పని అయ్యే ఉంటుందనుకుని వారిని పిలిచి గద్దించాడు. అంతేకాదు! రేపటి వరకు ఆ ఉంగరం తెచ్చివ్వకుంటే వారికి తగిన దండన విధిస్తానన్నాడు.

నౌకర్లందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. వారందరూ ఏళ్ళ తరబడి నమ్మకంగా పని చేస్తున్నారు. చివరికి వారందరూ కలసి తమ నెలజీతం ఖర్చు పెట్టి ఉంగరం చేయిద్దామని నిశ్చయించుకున్నారు.

ఇంతలోనే అతని కొడుకు శంకరం రామయ్య చేతికి ఉంగరాన్నిచ్చి, "నాన్నా! మా స్నేహితుని నాన్న మీలాంటి ఉంగరం చేయించుకుందామనుకుని మీ ఉంగరం తెమ్మని చెప్పాడు. నేను మీరు నిద్రలో ఉండగా ఆ ఉంగరాన్ని తీసుకొని వెళ్ళి అతనికి చూపించి తిరిగి తెచ్చాను. మీరు నౌకర్లను అనుమానించాల్సి వచ్చింది. మీ ఉంగరం మీరు తీసుకోండి" అని అన్నాడు. రామయ్య నౌకర్లను అనవసరంగా అనుమానించినందుకు నొచ్చుకున్నాడు. వారి త్యాగానికి ఆశ్చర్యపోయి వారి నిజాయితీకి తానే ఒక నెల జీతం ముట్టచెప్పాడు.

సంగనభట్ల రామకిష్టయ్య ధర్మపురి





# శ్రీ రాఘవేంద్ర చరిత్ర

9

శ్రీ సుజయీంద్ర తీర్థులవారు నిత్య నైమిత్తికి కర్మలను ఆచరించువారు. ప్రతి దినము మూడు నాలుగు సార్లు స్నానం చేయువారు; అత్యంత నియమ నిష్ఠలతో దేవపూజ మొదలగు పీఠాధిపతి కర్తవ్యములను చక్కగా నిర్వహించేవారు.

అట్టివారి నేత్రములకు శస్త్ర చికిత్స చేయించుకొనుటకు పూనుకొన్నచో, కొన్ని దినముల వరకు తమ పూజానుస్థానములు స్తంభించి నిలిచిపోవును.

యతిధర్మములకు అత్యంత భంగము కలుగును. కావున ఏమి చేయవలెనో ఆయనకు తోచలేదు.

ముఖ్యమైన సంగతేమిటంటే సుజయీంద్రుల వారికి శస్త్ర చికిత్స చేస్తే తప్పకుండా కన్నులు వస్తాయన్న నమ్మకం డాక్టర్ ప్రహ్లాద రావుగారికి లేదు.

అందువలన ఆయన ఈ శస్త్రచికిత్స చేయుట తన వల్లకాదని, మిక్కిలి బాధపడుతూ శ్రీరాఘ వేంద్రస్వామి వారిని ప్రార్థిస్తూ తిరిగి బళ్ళారికి వెళ్ళిపోయారు.

కొన్ని రోజుల తరువాత ఒకనాడు రాత్రి డాక్టర్ ప్రహ్లాదరావు నిద్రపోతుండగా కలలో తాను శ్రీశ్రీశ్రీ సుజయీంద్ర తీర్థుల వారిని మంత్రాలయం నుండి పిలుచుకుని వచ్చి, తమ ఆపరేషన్ బల్లపై పడుండబెట్టినట్లు, అంతలో నల్లగా, ఎత్తుగా, లావుగా వున్న ఒక సన్యాసి తన చేతులలో శస్త్రములు ధరించి, శ్రీ సుజయీంద్రతీర్థుల వారి కన్నులకు ఆపరేషన్ చేయనారంభించి నట్లుగా తనకు కళ్ళకు గట్టినట్లు కనిపించింది.

బి.వి. రాజశ్రీ



తరువాత ఆ సన్యాసి ప్రహ్లాదరావుని దగ్గరికి పిలిచి, "ఇదిగో చూశావా! ఈ ప్రకారముగా ఆపరేషన్ చేయవలెను. ఆపరేషన్ తరువాత ఈ మందులు వాడవలెను. ఆపరేషన్ పూర్తయిన తరువాత ఈ విధముగా కుట్లు వేయవలెను" అని ఆపరేషన్ విధానమంతా అతనికి వివరంగా చూపించి అదృశ్యమయ్యెను.

మరుక్షణం ప్రహ్లాదరావుకి మెలకువ వచ్చింది. ఒక్కసారి చుట్టూ చూశాడు. తాను ఆపరేషన్ థియేటర్‌లో ఆపరేషన్ చేయడం లేదు. అంతవరకూ ఎంతో హాయిగా నిద్రపోయి అప్పుడే తనకు మెలకువ వచ్చిన సంగతి తెలుసుకున్నాడు.

అంతవరకూ తాను చూసింది కలయని తెలుసుకుని మిక్కిలి ఆశ్చర్యపోతూ, "అరె! నా వల్ల వీలుకాని ఆపరేషన్ ఎలా చేయాలో రాఘవేంద్రస్వామి నాకు కలలో నేర్పారు. నేను వెంటనే మంత్రాలయం వెళ్ళాలి" అనుకొన్నారు.

అనుకున్నదే తడవుగా మరునాడుదయమే మంత్రాలయం చేరుకున్నారు.

మఠములో శ్రీ సుజయీంద్ర తీర్థుల వారిని కలుసుకొని, తనకు కలలో కన్పించిన వృత్తాంతమును వివరంగా చెప్పారు డాక్టరు.

అది విని తీర్థపాదులు చాలా సంతోషించారు. తనని శ్రీ రాఘవేంద్రస్వామి కరుణించారని తలచి ప్రహ్లాదరావుతో "ఈ ఆపరేషన్‌కు సమ్మతిస్తున్నాను. మీ ఇంటిలోనే నాకు ఈ ఆపరేషన్ జరగాలి" అన్నారు.

అందుకు ప్రహ్లాదరావు అమితమైన సంతోషంతో "నాకు తగిన ధైర్యం, శక్తి ఆ రాఘవేంద్రులు ప్రసాదించారు. మీరు ఇప్పుడే నాతో బళ్ళారికి బయల్దేరి రండి" అని ఆప్యాయంగా ఆహ్వానించారు.

27-11-1971 ఉదయం శ్రీపాదులవారు నిద్ర నుండి లేచి, స్నానము, ఆహ్నికము దేవపూజ మొదలగు నిత్య నైమిత్తిక కృత్యములను నిర్వహించారు.

తరువాత ప్రహ్లాదరావు శ్రీపాదుల వారిని ఆపరేషన్ థియేటర్‌కు పిలుచుకువెళ్ళారు. కలలో శ్రీ రాఘవేంద్ర గురువులు చూపిన రీతిగా మిత్రుడైన శ్రీనివాసమూర్తితో కలసి శ్రీపాదులవారి నేత్రములకు శస్త్ర చికిత్స చేసారు. తరువాత నెమ్మదిగా కుట్లు వేసి, కట్టు కట్టారు. తగిన మందులు ఇచ్చారు.



శ్రీపాదుల వారి నేత్ర శస్త్రచికిత్స జయప్రదముగా జరిగింది. ఆ రోజు నుండి శ్రీపాదులవారు తమ ఆశ్రమ ధర్మములను తు.చ. తప్పక నిర్వహిస్తూ, పదునైదు దినములు ప్రహ్లాదరావు ఇంటిలో శ్రీమూల రామ పూజ చేయసాగారు. అది తెలిసి చాలామంది భక్తులు రోజూ ప్రహ్లాదరావు ఇంటికి వచ్చేవారు.

పూజకు వచ్చి, భక్తులను సాదరంగా ఆహ్వానించి ప్రహ్లాదరావు సంతోషంతో తీర్థ ప్రసాదములు ఇచ్చేవాడు.

శ్రీరాఘవేంద్ర గురుసార్వభౌముల అనుగ్రహ విశేషముచేత ప్రహ్లాదరావుకి డబ్బు కొరత ఏమాత్రమూ కలుగలేదు. సరికదా, ఎన్నడూ లేనంతగా, ఎదురుచూడని విధంగా ఆయనకు రోజు రోజుకు రాబడి పెరగసాగింది.

కొన్ని రోజులకు శ్రీ సుజయీంద్ర తీర్థుల వారికి కళ్ళు బాగుగా కనిపించసాగాయి.

ఇక తాను మఠమునకు వెళతానని ఆయన తనకి శస్త్రచికిత్స చేసిన ప్రహ్లాదరావుని ఆశీర్వదించి, ఆయనకి ఫలమంత్రాక్షతలు నొసగి, మంత్రాలయం చేరుకొన్నారు.

చూసారా! శ్రీ రాఘవేంద్రుల వారి మహిమ ఎంత గొప్పదో! ఆయనను భక్తితో పూజించిన వారికి ఎప్పటికీ కొఱత వుండదు.

ఈ సంగతి ఇది చదివినవారు తప్పక తెలుసుకోగలరు.

## 2. సంగీతము

హిందూస్తానీ సంగీతాభిమానులలో భీమసేన జోషి పేరు విననివారుండరు. శ్రీ భీమసేన జోషి కర్నాటకలోని దార్వాడ జిల్లాయందు గదగ్ అను పట్టణమున వైష్ణవ బ్రాహ్మణ వంశమున జన్మించారు. వీరు శ్రీ రాఘవేంద్ర మఠ శిష్యులు. వీరికి సహజ మధుర కంఠము కలదు. వీరికి సంగీతము, హరికథ.





నాటకములు అనిన ముక్కువ ఎక్కువ. ఎక్కడైనా సంగీత కార్యక్రమం జరుగుతుందంటే అక్కడికి ఇతను వెళ్ళి సంగీతము వినుచు తన్మయత్వమును చెందెడివారు.

భీమసేనజోషి తండ్రి శ్రీ గురు రాజాచార్యుల వారికి కుమారుని సంగీత, సాహిత్యముల పిచ్చి ఏమాత్రం నచ్చేది కాదు.

కుమారుడు పాటపాడిన కోపగించుకునే వారు. కానీ భీమసేన్‌కు ఏవేవో కొత్త రాగాలు కనిపెట్టి తాను స్వయంగా పాట పాడి అందరినీ మైమరపించాలన్న అభిలాష వుండేది.

ఒకనాడు బాలకుడైన భీమసేన్ తండ్రి పోరు పడలేక ఎవరికీ చెప్పకుండా ఇల్లు వదిలి పూనా నగరానికి వెళ్ళిపోయాడు.

పూణా నగరంలో 'గానగంధర్వ' అనే పేరు గాంచిన కుందగోళ రామభావుల వారి పాదములకు నమస్కరించి తనని శిష్యునిగా స్వీకరించి, సంగీత విద్య నేర్పమని అమితమైన భక్తి శ్రద్ధలతో ప్రార్థించాడు. రామభావుల వారు ఆ బాలుని చూసి, "నీ మాటలు నాకు నచ్చినవి. ముందుగా ఒక పాట పాడు" అన్నారు.

భీమసేన్ తనకు నచ్చిన మంచి పాట పాడాడడు. ఆ బాలుని మధురమైన కంఠస్వరమును విని రామభావుగారు మిక్కిలి సంతోషించారు. వెంటనే భీమసేన్‌ని తన శిష్యునిగా చేర్చుకున్నారు.

ఆ రోజు నుండి అతనిని తన ఇంటిలో వుండమని, అతనికి కావలసిన సౌకర్యములను కల్పించారు. సంగీత విద్యను నేర్పసాగారు. తాను సంగీత కచ్చేరి చేయుటకు పోవు పలు స్థలములకు భీమసేన్‌ని తనతోపాటు తీసుకువెళ్ళేవారు.

ఇలా కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఏదో చిన్న విషయమై గురుశిష్యులకు భిన్నాభిప్రాయాలు ఏర్పడ్డాయి.

**(ఇంకా వుంది)**





# మహిమాన్విత అష్టాదశ మహాశక్తి పీఠములు

| | | | |
|---|---|---|---|
| 1. | అస్సాం | హరిక్షేత్రం | కామరూపాదేవి |
| 2. | ఆంధ్రప్రదేశ్ | అలంపురం | జోగులాంబాదేవి |
| 3. | ఆంధ్రప్రదేశ్ | ద్రాక్షారామం | మారుక్యాంబదేవి |
| 4. | ఆంధ్రప్రదేశ్ | పిఠాపురము | పురుహూతికాదేవిమాత |
| 5. | ఆంధ్రప్రదేశ్ | శ్రీశైలము | భ్రమరాంబదేవి |
| 6. | ఉత్తరప్రదేశ్ | ప్రయోగ | మాధవేశ్వరీ దేవి |
| 7. | ఉత్తప్రదేశ్ | వారణాసి | విశాలాక్షి దేవి |
| 8. | ఒడిస్సా | ఓడ్యానం | గిరిజాదేవి |
| 9. | కర్ణాటక | కంసపట్టణం | చాముండీ దేవి |
| 10. | బెంగాల్ | ప్రద్యుమ్నం | సింహళాదేవి |
| 11. | జమ్ము-కాశ్మీర్ | కాశ్మీరం | సరస్వతీదేవి |
| 12. | తమిళనాడు | కాంచీపురం | కామాక్షిదేవి |
| 13. | బీహారు | గయ | సర్వమంగళాదేవి |
| 14. | మధ్యప్రదేశ్ | ఉజ్జయిని | మహాకాళిదేవి |
| 15. | మహారాష్ట్ర | కొల్హాపూర్ | మహాలక్ష్మిదేవి |
| 16. | మహారాష్ట్ర | మహూర్యం | ఏకవీరకాదేవి |
| 17. | సిలోన్ (శ్రీలంక) | శ్రీలంక | శాంకరీదేవి |
| 18. | హిమాచల్ ప్రదేశ్ | జ్వాలాక్షేత్రం | వైష్ణవీదేవి |

జె. సుధాకరరావు పట్నాయక్, కాకినాడ



# తండ్రులూ జాగ్రత్త!

"అమ్మా! డాడీ ఇంట్లో లేరా?" అంటూ బడి నుండి వచ్చిన చింటూ అడగడంతో వంట గదిలో వున్న సుశీల, కాఫీ ఇస్తూ, "నాన్న ఇంట్లోనే వున్నారు. ఆయన స్నేహితుడితో ఏదో మాట్లాడుతున్నారు. ఆ గది దగ్గరికి వెళ్ళి అల్లరి చేయకు" అనడంతో చింటూ సరేనన్నాడు.

చింటూ హాలులో వీడియోగేమ్స్ ఆడుకుంటున్నాడు. గంట గడిచినా నాన్న బయటికి రాలేదు. గదిలో సన్నగా మాటలు వినిపిస్తున్నాయి. ఎన్నడూ లేనిది ఈ రోజు నాన్న స్నేహితుడితో గది తలుపులు మూసుకుని మాట్లాడుతున్నారెందుకు అని అనుకున్నాడు.

మరో గంట గడిచిన తరువాత నాన్న గది తలుపులు మెల్లగా తెరవడంతో, ముందుగా ఆయన స్నేహితుడు, బయటికి వచ్చి చింటూని చూసి ఒకలాగ నవ్వి వెళ్ళిపోయాడు. ఆ తరువాత నాన్నబయటికి వచ్చి,"చింటూ! నువ్వు వచ్చేసావా! ఎలా వుంది బడి" అంటూ ఏవేవో అడగసాగాడు.

తండ్రి ఒకలాగా వున్నట్టనిపించింది. ఆ తరువాత ఆయన రెండు గాజు గ్లాసులు తీసుకు వెళ్ళి కడిగి తిరిగి తన గదిలో అల్మారాలో పెడుతుండగా వెనుకగా వెళ్ళిన చింటూ అల్మారాలో ఏదో ద్రవం వున్న బాటిల్ వుండడం గమనించాడు.

"నాన్నా! ఆ బాటిల్లో ఏముంది? నాకు కొంచెం ఇవ్వు" అని అడిగాడు చింటూ.

అది విన్న రామారావు అదిరిపడ్డాడు. అది ఆల్కహోల్. ఆ సంగతి చింటూకి ఎలా చెప్పగలడు. ఏమీ మాట్లాడకుండా అల్మారా తలుపులు మూసాడు.

ఎ. మీనాకుమారి, కడప



చింటూకి అర్థం కానందున తిన్నగా తల్లి వద్దకు వెళ్ళి ఆ సంగతి అడిగాడు. సుశీల కోపంతో విసుక్కుని కొట్టడానికి చేతులెత్తింది. చింటూ పరిగెత్తుకుని నాన్న వద్దకు వెళ్ళి తిరిగి అడిగాడు.

చింటూకి ఏదైనా సర్ది చెప్పకపోతే, తనని వదలడనుకుని రామారావు, "చింటూ! ఇది దగ్గుమందు. నా స్నేహితుడికి దగ్గు ఎక్కువగా వున్నందువలన, డాక్టర్ వద్దకు వెళ్ళాలనకుని, నన్ను తోడుగా రమ్మన్నాడు. డాక్టర్ వద్దకు వెళ్ళితే ఇంజక్షన్ ఇచ్చి, చాలా మందులు రాసిస్తాడని నా వద్ద వున్న దగ్గుమందు ఇచ్చాను అంతే" అన్నాడు.

"మరి నువ్వెందుకు తీసుకున్నావు. నీకు దగ్గు లేదుకదా" అమాయకంగా అడిగాడు చింటూ.

"నాకు దగ్గు లేదని నీకు ఎవరు చెప్పారు. ఆఫీసు నుండి వచ్చినప్పటి నుండి, జలుబు, దగ్గు. అందువలన నేను కొంచెం తాగాను. ఇది పిల్లలు తాగకూడదు. చాలా చేదుగా వుంటుంది. ఇక వెళ్ళు" అని రామారావు అనడంతో చింటూ వెళ్ళిపోయాడు.

అంతా వింటున్న సుశీల భర్త వద్దకు వచ్చి, "ఇంట్లో పిల్లవాడిని పెట్టుకుని అలాంటి చెత్తని తాగవద్దని మీకు ఎన్నిసార్లు చెప్పాను. పైగా మీ స్నేహితుడిని తీసుకు వచ్చి ఇల్లు నాశనం చేస్తున్నారు. అసలు అది తాగడం వలన మీ ఆరోగ్యం పాడవుతుందని తెలిసి ఎందుకు తాగుతున్నారు. కనీసం మన పిల్లవాడిని చూసైనా మారండి. ఆ పాడు అలవాట్లను మానుకోండి" అన్నది.



"సుశీల! నేను తాగుబోతును కాను. ఏదో నెలకొకసారి మాత్రం. ఆ మాత్రందానికి అలా మాట్లాడతావెందుకు మన చింటూకి తెలియకుండా జాగ్రత్తపడతాను. నాకు ఆకలిగా వుంది" అని రామారావు అనడంతో సుశీల వంట గదిలోకి వెళ్ళింది.

వారం రోజుల తరువాత చింటూ బడి నుండి వచ్చేటపుడు వర్షంలో బాగా తడిచి ఇంటికి వచ్చాడు. తడిచిన తడి బట్టలలో వచ్చిన చింటూని చూసి తల్లి బాగా తిట్టి తడి బట్టలు విప్పి పొడి బట్టలు వేసి తలలో వున్న తడిని తుడిచింది. ఆ తరువాత వేడి కాఫీ ఇచ్చింది.

అరగంట తర్వాత చింటూకి తుమ్ములు ప్రారంభమైంది. గంట తర్వాత దగ్గు రావడం మొదలుపెట్టింది.

చింటూకి డాక్టర్, ఇంజక్షన్ అంటే భయం. నాన్న ఆ రోజు చెప్పిన దగ్గు మందు గుర్తుకు వచ్చింది. అమ్మకి తెలియకుండా అది కొంచెం తాగితే రాత్రి రాత్రి దగ్గు, జలుబు తగ్గిపోతుందని అనుకున్నాడు.

మందు బాటిల్‌పై అరలో వుంది. చింటూకి అందలేదు. అందువలన కుర్చీ దగ్గరికి జరిపి, దానిపై ఎక్కి ఆ బాటిల్ తీసుకుని క్రిందికి దిగి, బాటల్ మూత తెరిచాడు. మరుక్షణం ఒక విధమైన ఘాటు వాసన వచ్చింది.

సరిగ్గా ఆ సమయానికి ఆఫీసు నుండి వచ్చిన రామారావు, తన గదిలో కనిపించిన చింటూని చూసి లోపలికి వెళ్ళి, చింటూ ముందు ఆల్కహాల్ బాటిల్ చూసి కోపంతో చింటూ చెంప చెళ్ళుమనిపించాడు. అంతలో సుశీల అక్కడికి వచ్చి, చింటూని గట్టిగా తిట్టడంతో చింటూ ఏడుస్తూ దగ్గుమందు సంగతి చెప్పాడు.

అందులో చింటూ తప్పులేదని సుశీల వాడిని ఓదార్చి ప్రక్క గదికి పంపి, “ఇప్పుడైనా మీకు అర్థమైందా! మీ చేతులారా చిన్న వాడిని నాశనం చేస్తున్నారని తెలిసిందా! అసలు మీరు తాగడం తప్పు, అది దగ్గు మందని వాడికి అబద్దం చెప్పడం ఇంకా తప్పు. పైగా వాడిని అనవస రంగా కొట్టారు. వాడికి ఏం అర్థం అవుతుంది. నాన్న ఎపుడు నిజం చెబుతారు ఎప్పుడు అబద్దం చెబతారా అని ఎలా తెలుస్తుంది. వాడి భవిష్యత్ ఆలోచించి మంచి నిర్ణయం తీసుకోండి” అన్నది.

“నన్ను క్షమించు సుశీల. ఇన్ని రోజులు నీ మాటలు నేను అర్థం చేసుకోలేదు. పాపం అనవసరంగా వాడిని కొట్టాను. ఈ రోజు నుండి నేను తాగడం మానేస్తాను” అంటూ ఆల్కహాల్ బాటిల్ తీసుకువెళ్ళి చెత్త కుండీలోకి విసిరి వచ్చాడు. అది చూసి సుశీల ఆనందపడింది.





# అష్టాదశ శివక్షేత్రములు-శివుని పేర్లు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ శైలము | - | మల్లికార్జున స్వామి |
| 2. | శ్రీకాళహస్తి | - | శ్రీకాళహస్తీశ్వరుడు |
| 3. | కాశి | - | విశ్వేశ్వరుడు |
| 4. | కేదారము | - | కేదారేశ్వరుడు |
| 5. | రామేశ్వరము | - | రామలింగేశ్వరుడు |
| 6. | ద్రాక్షారామము | - | భీమేశ్వరుడు |
| 7. | తిరువణ్ణామలై | - | అరుణాచలేశ్వరుడు |
| 8. | చిదంబరం | - | చిదంబరేశ్వరుడు |
| 9. | కాంచీపురము | - | చంద్రశేఖరస్వామి |
| 10. | వృద్ధాచలం | - | వృద్ధగిరీశ్వరుడు |
| 11. | గౌతమితటం | - | త్ర్యయంబకేశ్వరుడు |
| 12. | జంబుకేశ్వరం | - | జంబలింగేశ్వరుడు |
| 13. | సౌరాష్ట్రం | - | సోమనాధేశ్వరుడు |
| 14. | ఉజ్జయిని | - | మహాకాళీశ్వరుడు |
| 15. | దారుకావనం | - | నాగలింగేశ్వరుడు |
| 16. | అమరేశ్వరం | - | ఓంకారలింగేశ్వరుడు |
| 17. | వైశాలి | - | ఘృష్ణేశ్వరుడు |
| 18. | తిరునింద్రవూరు | - | హృదయాలేశ్వరుడు |

బాలబాంధవ గంగరాజు మోహన్‌రావు, చెన్నై

# తెలుసుకోండి !

బాలలూ! ఏదైనా సంస్థకాని, స్కూలు కాని స్థాపించి కొన్ని సంవత్సరాలు అయిపోతే వాటి కాలానికనుగుణంగా ఒక్కొక్క పేరు వుంటుందని తెలుసుకోండి. ఉదాహరణకు సిల్వర్ జూబ్లీ అనో, డైమండ్ అనో పిలుస్తారు. మరి ఏఏ సంవత్సరాలకు ఏ పేర్లు పెడతారో వివరాలు మీ కోసం...

| కాలము | | పేరు |
|---|---|---|
| ❖ 5 సంవత్సరాలు | – | ఉడ్ అని పిలుస్తారు |
| ❖ 10 సంవత్సరాలు | – | టిన్ అని పిలుస్తారు |
| ❖ 15 సంవత్సరాలు | – | క్రిస్టల్ అని పిలుస్తారు |
| ❖ 20 సంవత్సరాలు | – | చైనా అని పిలుస్తారు |
| ❖ 25 సంవత్సరాలు | – | సిల్వర్ అని పిలుస్తారు |
| ❖ 30 సంవత్సరాలు | – | పెరల్ అని పిలుస్తారు |
| ❖ 35 సంవత్సరాలు | – | కోరల్ అని పిలుస్తారు |
| ❖ 40 సంవత్సరాలు | – | రుబీ అని పిలుస్తారు |
| ❖ 45 సంవత్సరాలు | – | సఫైర్ అని పిలుస్తారు |
| ❖ 50 సంవత్సరాలు | – | గోల్డ్ అని పిలుస్తారు |
| ❖ 55 సంవత్సరాలు | – | ఎమెరాల్డ్ అని పిలుస్తారు |
| ❖ 60 సంవత్సరాలు | – | డైమండ్ అని పిలుస్తారు |

కోట శ్రీదేవి, శృంగావరపుకోట



# ప్రపంచ సౌభాగ్య సూచీ

ప్రతి సంవత్సరం లండన్‌కు చెందిన లెగాటమ్ సంస్థ రూపొందించే గ్లోబల్ ప్రాస్పరిటీ ఇండెక్స్ (ప్రపంచ సౌభాగ్య సూచీ) ప్రకారం మొదటి పదిస్థానాలు ఆక్రమించిన దేశాలు క్రింది విధంగా ఉన్నాయి. ఈ సూచీలో భారత్ స్థానం 106 కావటం గమనార్హం.

| స్థానం | దేశం |
|---|---|
| 1 | నార్వే |
| 2 | స్విట్జర్లాండ్ |
| 3 | కెనడా |
| 4 | స్వీడన్ |
| 5 | న్యూజిలాండ్ |
| 6 | డెన్మార్క్ |
| 7 | ఆస్ట్రేలియా |
| 8 | ఫిన్‌లాండ్ |
| 9 | నెదర్లాండ్స్ |
| 10 | లక్సెంబర్గ్ |

# మన దేశంలో జీవావరణాలు

| | |
|---|---|
| సుందర్‌బన్స్ | పశ్చిమ బెంగాల్ |
| గల్ఫ్ ఆఫ్ మన్నార్ | దక్షిణ భారత్,పశ్చిమ శ్రీలంక మధ్య |
| నందాదేవి | ఉత్తరాఖండ్ |
| సిమిలీపాల్ | ఒడిసా |
| నీలగిరి | తమిళనాడు, కేరళ మధ్య |
| పాంచ్‌మరి | హోసంగాబాద్ (మధ్యప్రదేశ్) |
| అమర్‌కంటక్ | వింధ్య సాత్పురా పర్వతాలు |
| అగస్త్యమలై | తిరునల్వేలి (తమిళనాడు) |
| గ్రేట్ నికోబార్ | అండమాన్ నికోబార్ |
| కోక్రారెక్ | మేఘాలయ |
| ది హంగ్ బంగ్ | అసోమ్ |
| మానస్ | అసోమ్ |
| కాంచనగంగ | సిక్కిం |
| దిబ్రూ | సాయిహికా (అసోమ్) |

గోపాల్ శ్రీహరి, పాతాల

# పరీక్షల్లో నెగ్గిన 'శిబి'

పూర్వం 'శిబి' అనే చక్రవర్తి ఉండేవాడు. ఇతను "పరోపకారం ఇథం శరీరం" అనే సూక్తిని అక్షరాల అమలు చేసేవాడు. ఎవరికి ఆపద వచ్చినా వారు వెంటనే శిబి చక్రవర్తి దగ్గరికి వచ్చి ఆపదలు తొలగించుకునేవారు. ఎవరు ఏ దానం అడిగినా 'లేదు', 'కాదు' అనటం అతనికి తెలియదు.

ఆ రోజు 'శిబి' చక్రవర్తి వద్దకు ఓ పావురం వచ్చి వాలి తనను రక్షించమని వేడుకున్నది. ఆపదలో ఉన్నవారిని ఆదుకోవటమే శిబి ధ్యేయం కదా! "నిన్ను కాపాడుతా" అని పావురానికి అభయ హస్తం ఇచ్చాడు. ఇంతలో విచిత్రం జరిగింది. ఓ డేగ వచ్చి "ఈ పావురం నా ఆహారం, నా నోటి దాకా వచ్చిన ఆహారం తీసుకుంటావా? నా ఆహారం నాకు ఇచ్చేయ్" అని అడిగింది డేగ. శిబి చక్రవర్తి కలవరపడిపోయాడు. శరణార్థిని కాపాడక తప్పదు కదా! "నేను ప్రాణం పోయినా మాట తప్పను" పావురం తప్ప నీవు ఏమి కోరుకున్నా అది ఇస్తానని శిబి చెప్పాడు.

ప్రపంచంలో ఆడిన మాట తప్పని "నీవు పావురం బరువు ఎంత ఉందో అంతే తూకంలో సరితూగగల తొడ మాంసం ఇవ్వమని" డేగ కోరింది. శిబి చక్రవర్తి సరే అన్నాడు. శిబి తరాసు తెప్పించాడు. ఒక వైపు త్రాసులో పావురాన్ని ఉంచాడు. రెెండో వైపు తన తొడ మాంసాన్ని కోసి వేశాడు. ఎంత మాంసం కోసి వేసిన పావురం బరువుకు సరితూగలేదు. చివరికి శిబి చక్రవర్తి స్వయంగా తానే త్రాసులో కూర్చొని ఆ పావురానికి బదులుగా తనను తినమని శిబి డేగను కోరాడు. అపుడే విచిత్రం జరిగింది.

పావురం అగ్నిదేవునిగా, డేగ ఇంద్రునిగా మారిపోయారు. ఈ దైవ పరీక్షను చూసి శిబి ఆశ్చర్యపోయాడు. అప్పుడు ఇంద్ర, అగ్ని దేవులు సంతోషపడి ఇలా అన్నారు. "నిన్ను పరీక్షించాము. నీవే విజేతవు. నీ దాన గుణం, త్యాగం గూర్చి విన్నాము. ఈ రోజు స్వయంగా చూసి సంతోష పడ్డాము అని ఈ భూమిపై సూర్య చంద్రులున్నంత వరకు నీవు గొప్ప దాతగా ఉంటావని దీవించారు.

రావుల రాజేశం, జమ్మికుంట



# తెలుసుకుందాం!

1. మన దేశంలో నేలపై రైల్వే ట్రాక్ కిలోమీటర్ దూరం నిర్మించాలి అంటే దాదాపు మూడు కోట్లు కర్చు చేయాలి.
2. మన దేశంలో బులెట్ ట్రయిన్‌ట్రాక్ కిలోమీటర్ దూరం నిర్మించాలి అంటే దాదాపు 50 కోట్లు కర్చు చేయాలి.
3. ప్రతి సంవత్సరం మనం ఎలుకల వలన 25 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు నష్టపోతున్నాం.
4. కాఫీ, టీలలో చక్కర బదులు ఉప్పు వాడకందారులున్న దేశం 'టిబెట్'
5. 'వీనస్' నగరం ప్రతి పది సంవత్సరాలకు మూడు అంగుళాల వంతున నీటిలోకి కుంగుతుంది.
6. ప్రపంచంలో ఎక్కువ నదులున్న దేశం 'ఫిన్లాండ్'
7. 'గంగా, యమునా' నదుల జన్మ స్థలం హిమాలయాలు
8. 'సింధూనది' జన్మ స్థలం టిబెట్ పీఠభూమి
9. మాల్దీవులలో మొత్తం 1200 ద్వీపాలు ఉన్నవి.
10. తెల్ల ఏనుగులు ఎక్కువగా ఉన్నదేశం 'థాయ్‌లాండ్'
11. ఈత తెలియని జంతువు 'ఒంటె'
12. నీటిని పీల్చగలిగిన పిట్ట 'పావురాయి'
13. న్యూజిలాండ్ దేశంలో 'కాకి' 'పాము' కనిపించవు.
14. జపాన్ దేశంలో మొత్తం 6,852 దీవులు కలవు.
15. వాన చినుకు గంటకు ఏడు మైళ్ళ వేగంతో ప్రయాణిస్తుంది.
16. ట్రాఫిక్ సిగ్నెల్స్‌ను తొలిసారి కంప్యూటరీకరించిన నగరం 'టొరంటో (కెనడా)'.
17. మన శరీరంలో రెండు లక్షల చెమట గ్రంథులు ఉండగా అందులో ఇరవై అయిదు వేలు మన పాదాల్లో ఉన్నాయి.
18. మనిషి మూత్రపిండం ఒక రోజుకు దాదాపు 190 లీటర్ల రక్తాన్ని వడపోస్తాయి.
19. షులేస్‌కొనల్లో ఉండే ప్లాస్టిక్ భాగాన్ని 'అగ్లెట్' అంటారు.
20. కాస్తకూడా ఎగురలేని జంతువు ఏనుగు.
21. అణుబాంబుదాడి నుండి కూడా బొద్దంకి బ్రతుక గలదు.
22. ప్రపంచ వ్యాప్తంగా ఏటా 20 లక్షల మంది దోమకాటుకు బలి అవుతున్నారు.
23. బల్లి ఎన్నడు నీళ్ళు తాగదు.
24. ఈగ జీవితకాలం పదిరోజులు.
25. ప్రతి ఎనిమిది మందిలో ఒకరు నిద్రలో గురకపెడుతుంటారు.

బెల్లంకొండ నాగేశ్వరరావు, చెన్నై

# ప్రపంచ వ్యాప్త జోస్యాలు!

1. మెటపోమాన్సీ — నుదుటి గీతలను బట్టి చెప్పే జోస్యం.
2. ఇట్చిటోమాన్సీ — బతికిన లేక చచ్చిన చేపల ఆధారంగా చెప్పే జోస్యం
3. విక్నో మాన్సీ — ముక్కోణాకారంగా నిలబెట్టిన క్రొవ్వొత్తుల కాంతిని బట్టి చెప్పే జోస్యం.
4. ఓనీకో మాన్సీ — గోళ్ళపై సూర్యకాంతి ననుసరించి చెప్పే జోస్యం.
5. క్రొమినియోమాన్సీ — ఉల్లిపాయల పెరుగుదలను బట్టి చెప్పే జోస్యం
6. యారో మాన్సీ — వాతావరణ మార్పుల ననుసరించి చెప్పే జోస్యం
7. ఒయోనో మాన్సీ — మద్యం రంగు రుచి రూపు ననుసరించి చెప్పే జోస్యం
8. పెరోమాన్సీ — కరిగిన మైనం నీటిలో వేసేక ఏర్పడే ఆకారాన్ని బట్టి చెప్పే జోస్యం
9. ఓనోమాన్సీ — నీటిలో కోడిగుడ్డు తెల్లసొన కరిగించి చెప్పే జోస్యం
10. సైకోమాన్సీ — సార ఆకుని మండించి చెప్పే జోస్యం
11. క్రెస్మో మాన్సీ — పూనకం వ్యక్తి మాటవిని బట్టి చెప్పే జోస్యం
12. బొటానోమాన్సీ — మర్రి రావి ఆకులిని కొమ్మలిని మండించి చెప్పే జోస్యం
13. ఓసియామాన్సీ — పాములతో చెప్పే జోస్యం
14. హాలో మాన్సీ — నిప్పులో ఉప్పు వేసి చెప్పే జోస్యం
15. జెలోమాన్సీ — పిచ్చివాళ్ళు నవ్వు ననుసరించి చెప్పే జోస్యం
16. కల్కో మాన్సీ — ఇత్తడి లేక రాగి గిన్నె వినియోగించి వ[illegible]నిబట్టి చెప్పే జోస్యం
17. సిఫలోమాన్సీ — మబ్బుల ఆకారం కదలికలిని బట్టి చెప్పే జోస్యం
18. ఢాప్నో మాన్సీ — సంపెంగ ఆకులిని మండించి చెప్పే జోస్యం
19. సెలనోమాన్సీ — చంద్రకళలిని బట్టి చెప్పే జోస్యం
20. మకరోమాన్సీ — కత్తులు చురకత్తులు బాకులను ఉపయోగించి చెప్పే [illegible]

మాదవరపు క్రిష్ణ, కాకినా[illegible]



# తొమ్మిది అంతస్థుల గాజు గ్రంథాలయం!

ఈ మధ్య యూరప్ ఖండంలోని ఇంగ్లాండ్ దేశపు ప్రముఖ నగరమైన బర్మింగ్‌హామ్‌లో ప్రపంచపు అత్యంత భారీ గ్రంథాలయం నిర్మించారు. ఈ గ్రంథాలయం తొమ్మిది అంతస్థులతో నిర్మించబడింది. అయితే గ్రంధాలయ నిర్మాణం మామూలు భవనాల మాదిరిగా కాక ధృడమైన గాజుతో నిర్మించబడటం విశేషం! ఈ గ్రంథాలయం సుమారుగా 20 లక్ష గ్రంథాలు భద్రపరచబడినవి. 1469 సంవత్సరంలో నిర్మించబడి అతి పురాతన గ్రంథాల ప్రతులు సైతం ఇక్కడ లభించడం విశేషం! ఆ తర్వాతి కాలాలలో ముద్రించబడ్డ ప్రముఖ గ్రంథాలు కూడా సైతం ఇక్కడ వున్నాయి. కొన్ని ప్రాచీన గ్రంథ ప్రతుల మూల్యం (విలువ) ప్రస్తుత మార్కెటు ప్రకారం కొన్ని లక్షల రూపాయలలో (ఒక్కోదానికి) వుంటుందంటే ఆశ్చర్యం కలుగకమానదు. తొమ్మిదంతస్థుల భవనం ఎత్తు 200 అడుగులుంటుంది. ఆ గ్రంథాలయం నగరానికే మణి పూసలా మారిపోయిందిపుడు. దీని నిర్మాణం 2009 సంవత్సరంలో ప్రారంభించబడి ఈ మధ్యనే పూర్తి కావటం విశేషం! ఈ గ్రంథాలయం నిర్మించడానికయిన ఖర్చు 2000 కోట్ల రూపాయలు. ఇందులో వున్న అపురూప ప్రాచీన గ్రంథాల విలువతో పోలిస్తే నిర్మాణపు వ్యయం చాలా తక్కువనే చెప్పాలి.

ప్రతి సంవత్సరం 30 లక్షల మంది పాఠకులు దీనిని సందర్శిస్తుంటారని అంచనా! ఇంతకు ముందుండే పాత గ్రంథాలయ భవనం నుండి ఈ గాజు గ్రంథాలయానికి పుస్తకాలన్ని అతిభద్రంగా చేరడానికి 3 నెలల సమయం పట్టిందట! ఈ తొమ్మిదంతస్థుల గ్రంథాలయంలో చివరి తొమ్మిదో అంతస్థులో షేక్స్‌పియర్ పేరిట ఒక ప్రత్యేక గదిని ఏర్పాటు చేశారు. ఈ గదిలో 40000 గ్రంథాలున్నాయి. ఒకేసారిగా 3000 కూర్చుని చదువుకోవడానికి ఏర్పాట్లు చేయడం జరిగింది. గ్రంథాలే కాక ఇందులో 200 కంప్యూటరులు వున్నాయి. ఈ గ్రంథాలయం 25 అంగుళం సైజున్న పుస్తకం నుండి 56 కిలోల బరువున్న గ్రంథం వరకు వున్నాయి.

జి. ప్రభాకర్ రావు, హైద్రాబాదు

# చందాదారులకు విజ్ఞప్తి

బాలమిత్ర చాలామంది ఏజంట్లకు మేము పంపుతున్నాం. కానీ కొందరు పాఠకులకు బాలమిత్ర దొరకడం లేదని మాకు ఉత్తరాలు వ్రాస్తున్నారు. అందువలన బాలమిత్ర కావాలనుకుంటే సంవత్సర చందా రూ. **180/-** చెక్కు ద్వారా డి.డి. ద్వారా మా కార్యాలయానికి పంపిన, బాలమిత్ర పోస్ట్ ద్వారా మీ ఇంటికి చేరుతుంది. మీ విలాసము వివరంగా పిన్‌కోడ్‌తో సహా వ్రాసి పంపగలరు. క్రింద తెలిపిన బాలమిత్ర విలాసమునకు పంపగలరు.

D. No. 8-4, PALLAPU VEEDHI
...RU - 533 213, E.G.Dt.(A.P.)

**బాలమిత్ర**

**THE BALAMITRA**

New No.11, Old No.6, Viswanathapuram 2nd Street,
Kodambakkam, Chennai - 600 024.

కొత్త నెం.11, పాత నెం.6, విశ్వనాథపురం 2వ వీధి, కోడంబాక్కం, చెన్నై-600 024.

# రచయితలకు మనవి

నమస్కారం, రచయితలకు మనవి. మీరు బాలమిత్రకు ఇది వరకు ఎన్నో కథలు, వింతలు విశేషాలు, ఆర్టికల్స్, భక్తి సమాచారం, లాంటి ఎన్నో పంపుతున్నారు. మీ ఆదర అభిమానాలకు చాలా సంతోషం. ఇదివరకు మీరు పంపుతున్న కథలు, ఆర్టికల్స్ మా చెన్నై ఆఫీస్‌కు పంపుతున్నారు. అందులో కొన్ని కథలు, ఆర్టికల్స్ లాంటివి విలాసం తప్పుగా రాయటం వలన మాకు అందడం లేదు. అందువలన ఇక మీదట మీ కథలను, ఆర్టికల్స్‌ను మా కొత్త విలాసానికి పంపవలసినదిగా కోరుచున్నాం. మీరు కథలు పంపించేటపుడు కథలు వెంట తిరుగు కార్డు, లేదా స్టాంపు కవరు పంపవలెను.

**మా కొత్త విలాసం**

**బి.ఆర్.వరదరాజులు**
"బాలమిత్ర", 1-7-281/2, బాకారాం,
ముషీరాబాదు, హైదరాబాదు -500 020.

**B.R. VARADHARAJULU**
"BALAMITRA", 1-7-281/2, Bakaram,
Musherabad, Hyderabad - 500 020.

**Cell : 08977088350**

Owned, Published and Printed by B.R. Purushotham, Printed at Meera Offset Printers, No.104, V.R.Pillai Street, Triplicane, Chennai-600 005 and **Published** from No.30/34, Chakrapani Street, S1, 2nd Floor West Mambalam, Chennai-600 033. **Editor** B.R. Purushotham. (9790848460, 9677099942).

REGD. NO.TN/CC(S)Dn/523/15-17 BALAMITRA (TELUGU) ₹ 15.00 JUN-2015
REGISTERED WITH THE REGISTRAR OF NEWS PAPER FOR INDIA. NEW DELHI. Regd. RNI.1198/57
POST DATE - 26th to 31st EVERY MONTH - DATE OF PUBLICATION OF LAST WEEK OF EVERY MONTH